22793

చింతారామకృష్ణారెడ్డి సమర్పించు

గీతాకృష్ణా కంబైన్స్

# సిరిసిరిమువ్వ

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: కె.విశ్వనాథ్ B.Sc.

సంగీతం: కె.వి.మహదేవన్, ఫొటోగ్రఫీ: వి.యస్.ఆర్.స్వామి

నిర్మాతలు: కర్రి లచ్చారెడ్డి, యస్.భాస్కరరెడ్డి, యు.చిన వీర్రాజు

నిర్మాణ పర్యవేక్షణ: పడిద నాగేశ్వరరావు




రాయలసీమ: నటేష్ ఫిలిమ్ ఎక్స్చేంజ్ (గుంటకల్)

## లోకంపోకడ











## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం : 7–1–'77
నళనామ సం. పుష్య శు. విదియ
సంపుటము 70 : సంచిక :19

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60
" ఆరుమాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

# మనలో మాట

మా పాఠకులకు, ఏజెంట్లకు, ప్రకటన కర్తలకు రచయితలకు అందరికీ మా 'నూతన ఆంగ్ల సంవత్సరాది' శుభా కాంక్షలు !

★ ★ ★ ★

ఈ వారం నుంచి 'మగదిక్కు' సీరియల్ నవల ప్రారంభిస్తున్నాము. రచయిత పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు యిటీవల వారపత్రికలో పడ్డ "మేనరికం" "వెండి పండుగ" అన్న కథల ద్వారా మా పాఠకులకు సుపరిచితులే.

ప్రముఖ కవి, ప్రసిద్ధ పండితులు - 'మహోపాధ్యాయ' 'కవిసమ్రాట్' మున్నగు బిరుదు లందుకున్నారు. చిన్నప్పటి నుంచి అష్టావధాన, శతావధానాలు చేసి, వివిధ ప్రాంతాలలో సన్మానాలు పొందారు. "త్రిలింగ దేశం మనదేనోయ్" అన్న వీరు రచించిన పాట, యిటీవల తెలుగు ప్రపంచ సభలలో కూడా ప్రత్యేక మన్నన పొందింది.



బి. ఏ., విద్వాన్, డబుల్ పి. ఓ. ఎల్. పట్టా లందుకుని విజయవాడ మ్యునిసిపల్ ఓరియంటల్ కాలేజీలో అధ్యాపకునిగా ఎంతో కాలంగా పనిచేస్తున్న 'శాస్త్రి' గారు పాతిక పైచిలుకు గ్రంథాలు ప్రకటించారు. 1918లో పుట్టారు... కవిత్వంతోపాటే కథలు కూడా వ్రాయాలన్న వీరి కుతూహలం 1943 లోనే 'సీలం' అనే కథల సంపుటంగా వెలువడింది. 1947 లో అప్పుడు విజయవాడ నుంచి వెలువడుతూండే జన్మభూమి దిన పత్రికలో వీరు 'కవిరాజు' అనే సీరియల్ రచన చేశారన్న సంగతి యీ తరం పాఠకులకు బహుశా గుర్తు వుండటం కష్టం. కనుక శాస్త్రి గారు యీ "మగదిక్కు" నవలతో, వర్తమాన పాఠక లోకానికి నవలా కర్తగా పరిచయమవుతున్నారనుకోవాలి. ఇది కొంచెం పెద్ద నవల — ఇదిగాక త్వరలోనే మరొక పెద్ద సీరియల్ కూడా మా పాఠకులకు అందించనున్నాము. ఆ రచయిత పేరు, నవల పేరు కూడా పై వారం ప్రకటిస్తాము.




### అట్టమీద బొమ్మ

హిందీ చిత్రసీమలో, అతి తక్కువ వ్యవధిలో తారాపథానికి ఎగబ్రాకి, యువహృదయాలను, గిలిగింతలు పెడుతున్న నటీతార విద్యాసిన్హా ముఖచిత్రంతో 24—12—76 సంచిక ఎంతో ఆకర్షణీయంగా, వాస్తవికంగా వుంది. ప్రేక్షకుల అభిరుచిని గుర్తిస్తున్న సంపాదకుల "నేర్పు" ప్రశంసనీయం.

బచ్చు వీర్రాజు, (ద్రోణాచలం)

* * *

24-12-76 నాటి ముఖ చిత్రం ఏమి బాగులేదు. కొత్తవారు పరిశ్రమకు అనేక మంది వస్తున్నారు కదా! వారిని ముఖచిత్రంలో వేస్తే బాగుంటుంది. 'ఆమెకేం కావాలి" ముగింపు మనస్సులను ఆకట్టుకొన్నది.

కె. హరిగోపాల్, (హైదరాబాదు)

* * *

24-12-76 విద్యాసిన్హా ముఖచిత్రం పత్రిక చాలా అందంగా ఉంది. ముఖ చిత్రములో తీసుకుంటున్న శ్రద్ధ అద్భుతము. కథలు అన్ని బాగున్నవి. డాక్టర్ వనిత సీరియల్ చాలా బాగుంటున్నది. పత్రికను అభినందిస్తున్నాను.

ఎం. నిశాకరరెడ్డి (కరీంనగర్)

### సినిమా

మీరు 24-12-76 ఆంధ్రపత్రికపై ప్రచురించిన విద్యాసిన్హా ముఖచిత్రము మీపత్రికను అత్యంత రమణీయముగ చేకూర్చినది. ఇది చెప్పుటలో సంశయమేమి లేదు.

మీరు ఈపత్రికలో 25వ పేజీ నుంచి 31వ పేజీవరకు ప్రచురించిన "సినిమా" న్యూస్ ఎప్పటికీ ఎందరో పాఠకుల మనస్సులను దోచుకున్నదన్న మాటలో ఏమాత్రము అబద్ధమునకు తావులేదు. "సాహసగాళ్ళు" అడ్వర్టైజ్మెంటు ఎంతో ఆకర్షణీయముగా నున్నది. "సినిమా విశేషాలు" అను శీర్షికను ఇక పద్మించ వలసినాదు. ఎప్పుడూ పుస్తకాలు చదువని మున్ను కూడా మీ ఈవారం పత్రిక ఆకర్షించడం నాకు ఎంతో విచిత్రముగా నున్నది.

పి. వివేకానంద, (నెల్లూరు)

### సీరియల్

ఈవారం కథల్లో 'సత్యం వధ ధర్మం చెర' కరుణాత్మకంగా ఉంది. హృదయాల్ని కదిలించేలా ఉంది. 'డాక్టర్ వనిత' సీరియల్‌లో రచయిత్రి, ఏ జీవికైనా సకల భోగభాగ్యాలు మాత్రమే కాదు కావలసింది. వాటితోపాటు మమత, మానుషాలు అందించి, ప్రేమతో ఆదరించే ఓ తోడు కూడా దొరికినప్పుడే ఆ జీవి జీవితం సంపూర్ణత నొందుతుంది. ఆ తోడు దొరికే వరకు ఆ అన్వేషణ నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది. ఈ సత్యాన్ని చక్కగా వివరించారు. ఇకపోతే ముఖ చిత్రాన్ని కొత్తగా హీరో, హీరోయిన్లకే పరిమితం చేయకుండా, గుమ్మడి, సత్యనారాయణ వంటి కారెక్టర్ ఏక్టర్స్‌ని కూడా వేస్తే బాగుంటుంది.

ఎ. యస్. వి. ప్రసాదు, (కాయగడ)

### కథలు

నటి 'విద్యాసిన్హా' ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్ర వార పత్రిక అందాల రాకుమారిలా అలరించింది. 'ఆమెకేం కావాలి ?' సీరియల్ త్వరగా ముగిసినందుకు బాధ కలిగింది. 'సత్యం వధ, ధర్మం చెర' కథ వాస్తవికంగావుంది. మిగిలిన కథలు, శీర్షికలు బాగున్నాయి. ముఖ్యంగా ధర్మ పథం, లోకం పోకడ చాల ఆకర్షించింది.

వి. ఎస్. బాబు, (పెడన)

* * *

17-12-76 తేదీన వెలువడిన మీ (మా) ఆంధ్ర సచిత్ర వార పత్రిక, అట్టమీది బొమ్మ సుజాతతో చాల ఆకర్షణీయంగా ఉన్నది. తీయని పాటలు, రాతిమేడపులు, కథలు చాల బాగున్నాయి.

ఎస్. హర్‌బంస్‌సింగ్, సై. అశోక్ కుమార్, (కరీంనగర్.)




# కలకాలం నిలిచిన ఒక ప్రేమ కథ

అందానికి నిర్వచనం రత్న.

ఆమె నవ్వినప్పుడు పక్కనుంటే మే నెలలో టూరిస్టుగా వచ్చిన యూరోపియన్ తిరిగి యూరప్‌కు వెళ్ళిపోయానా, అన్న అనుమానానికి గురవుతాడు. ఆమె నడక చూడడంకోసం కొండల్లో గలగల పారే సెలయేరు ఒక్క క్షణం ఆగుతుంది. ఆమె ఎండలో నడుస్తూంటే సూర్యుడు నిర్వీర్యుడౌతాడు. ఆమె వెన్నెలలో మసులుతుంటే చందమామ మబ్బు చాటున దాక్కుంటాడు.

ఇవి ఇతరులకు సంబంధించిన విషయాలు. నాకు సంబంధించినంతవరకూ — ఆమెను చూస్తే మరి చూపులు మరల్చుకోలేనన్న విషయమొక్కటే నాకు తెలిసినది.

ఆడదానికి మరీ రత్న కున్నంత అందమెందుకు అని ఒక పర్యాయం నా మిత్రుడొకడు నన్నడగ్గా అలా అనుకునేపక్షంలో నువ్వు రత్న గురించి ఆలోచించవద్దని చెప్పాను.

నేను బీయస్సీ మూడోసంవత్సరం చదువుతున్నప్పుడు రత్న ఫస్టియర్లో చేరింది. చూడగానే నామనసదోలా అయిపోవడంతో అర్జంటుగా ఆమె వివరాలు పూర్తిగా కూపీలాగను. అన్నీ తెలిసేసరికి నా సంతోషానికి పట్టపగ్గాలు లేవు. నేను రత్నను పెళ్ళిచేసుకోవాలనుకునే పక్షంలో — ఇబ్బందివస్తే — కట్నకానుకలదగ్గర తప్ప — మరెక్కడా రాదు. కష్టపడి వెతికితే ఆమె నాకేదోవిధంగా దూరపుచుట్టం కాకపోదు.

ఈ ధైర్యం కలగగానే రత్నమీద నాదృష్టి మరింత తీవ్రంగా పడింది. ఆమె పరిచయం కోసం చాలా ఇదిగా తపించిపోతూండేవాడిని. నేనుధైర్యంచేసి ఆమెను పలకరించడానికి చాలా కాలం పట్టింది.

మొట్టమొదటిరోజున ఆమెను నేను దప్పుటొద్దున పలకరించాను. నా ధైర్యానికి కారణం ఆమె ఒంటరితనం. నేనామెను పలకరించినప్పుడామె ప్రశ్నార్థకంగా చూసింది? అబ్బ — ఆ చూపులు ... వర్ణనకసాధ్యం! ప్రపంచంలోని అసంఖ్యాక అమ్మాయిల్లారా — అలా చూడలేనప్పుడు మీ కళ్ళే వ్యర్థం...

ఆమె కేవలం ప్రశ్నార్థకంగానే చూసింది కానీ తడబడలేదు. కానీ నేను తడబడుతున్నాను. తడబడుతూనే తన్మయావస్థలోకి జారిపోతున్నాను.

'మీరెవరో నాకు తెలియదు!' అందామె నా మౌనానికి ఇబ్బందికి లోనైనదై —

నేను నవ్వాను. ఆమె పెదవుల కదలికవల్ల సృష్టించబడ్డ శబ్దతరంగాలు నా వీనులకు తాకడం — అందులోనూ అంతదగ్గర్నుంచి — ఇదే ప్రథమం!

"మీరు నాకు తెలుసు—" అన్నాను.

'అయితే—...' అందామె కాస్త చిరాగ్గా. నేనొక్క నిముషం తటపటాయించి — 'ను మీతో పరిచయాన్నభిలషిస్తున్నా —'' అన్నాను.

ఆమె ముఖంలో అదోరకమైన మందహాసం వెలిసింది. 'ఎందుకూ?' అంది.

ఇది మరొకళ్ళు అడిగి ఉంటే నిజంగా అర్థం లేని ప్రశ్న! అర్థం లేని పదాలు రత్న నోటినుంచి రావన్నది నా నమ్మకం కాబట్టి — ఈ ప్రశ్నకు నేను జవాబియ్యాల్సుంటుంది.

"ఎందుకంటే ఏం చెప్పను? కొంత

మందికి కొంత మందితో పరిచయం చేసుకోవాలనుంటుంది - అలా నాకు మీతో పరిచయం పెంపొందించుకోవాలనుంది !''

రత్న నవ్వింది - ''ఇలా నాతో చాలా మంది అన్నారు. అయితే నా కిష్టంలేదు. ఎందుకంటే నాతో స్నేహం కోరేవారు మానాన్న గారి పర్మిషన్ తీస్కోవాలి -'' అందామె.

'అలాగే తీస్కుంటాను -' అన్నా నుత్సాహంగా.

'ఏమని ఏసుకుంటారు ?' అంది రత్న నవ్వుతూ.

ఆలోచిస్తే నాకు నవ్వొచ్చింది. 'బలే తమాషా అయిన వారంటి మీరూ 'అన్నాను.

'అందుకే మీరూ తమాషాకట్టిపెట్టండి ' అంది రత్న

'ప్రస్తుతానికి కట్టినట్టే కనీ - రేపు కూడా మీరు బీచికొస్తారా ?' అన్నాను.

'ముందుగా కార్యక్రమాలను తయారు చేసుకునే అలవాటు నాకు లేదు -'అందిరత్న.

'ఇక ముందు చేసుకుంటే నాబోటిగాడు ధన్యుడౌతాడు -'

రత్న నా వంక చురుగ్గా చూసింది -' ఇది సినిమా కాదు -' అంది.

'కాకపోవడమే మంచిది. సినిమాలో ఇలాంటి అందాలు మూడు గంటలకు మించి కనపడవు బయటయితే ఎంతసేపయినా చూడవచ్చు జీవితాంతం అనుభవించవచ్చు -'

'క్షణిక పరిచయంలో జీవితాంతం గురించి ఆలోచిస్తున్నారు -' అంది రత్న.

'అది మీ ప్రభావం. అందుకే మీ పరిచయం కోరుకుంటున్నాను -'

'అందుకు దారులు వేరే ఉన్నాయి. ఉదాహరణకు నాకు కవులంటే చాలా ఇష్టం -' అంది రత్న.

'అయితే ఈ ప్రపంచంలోని ప్రతి ఒక్కడూ మీకిష్టుడౌతాడు ఎందుకంటే మిమ్మల్ని చూసిన వాడెవడైనా కవిగా మారవలసిందే -'

'అటువంటి వాళ్ళని నేను కవులనలేను నన్ను చూసి కవిగా మారినవాడు నా మీదనే కవిత్వం చెబుతాడు - అదైనా పదిమంది కవులను అనుకరిస్తూ ! సహజంగా కవి అయిన వాడికి నేనొక ప్రేరేపణ నౌతాను. నేనందంగా ఉండిన పక్షంలో నా సౌందర్యం కవిని ప్రేరేపించాలిగానీ తయారు చేయకూడదని నా ఆశయం!' అంది రత్న గంభీరంగా.

ఈ మాటలు రత్న హృదయంలోంచీ వచ్చాయనిపించింది. అదీ ఆమెకోరిక. తనకారణంగా కావ్యాలు వెలువడాలి. కవిత్వం సృష్టించబడాలి. ఆశక్తి ఉన్నవాడినే ఆమె కోరుకుంటోంది. అప్పటికామెదగ్గర సెలవు పుచ్చుకున్నాను.

* * *

నా కవిత్వం విని పకపకా నవ్వింది రత్న. ''మీలో ఇంతసెన్సాఫ్ హ్యూమరుందనుకోలేదు -'' అంది వస్తూన్న నవ్వు నాపుకునేందుకు ప్రయత్నిస్తూ.

నాముఖం చిన్నబోయింది. నేను కూటికీ గుడ్డకీ ముఖంవాచిన నిరుపేదల ఆక్రందనకు కావ్యరూపమిస్తే రత్న నాసెన్సాఫ్‌హ్యూమర్‌ను మెచ్చుకుంటోంది - తేరుకుని - 'చూడండీ - నేను చాలా సీరియస్‌గా రాసిన కవిత్వం కన్నీరు తెప్పిస్తుందనుకున్నాను -' అన్నాను బాధగా.

రత్న షాక్‌తిన్నట్లు నావంకచూసి - 'మీరిది నిజంగా సీరియస్‌గా రాశారా సరదాగా తమాషాకి రాశారనుకున్నాను -' అంది.

'సరదాలూ. తమాషాలూ నాదగ్గర పనికిరావు. కొన్నివిషయాలు నేను చాలాసీరియస్‌గా తీసుకుంటాను -' అన్నాను.

'అయితే అయాం వెరీ సారీ - నాకు కవులంటే ఇష్టమన్నానుగానీ - ఇలా ప్రయత్నించి కవులను కమ్మనలేదు కదా -' అంది రత్న.

'మరేం చేయను - నాకు మీ పరిచయం కావాలి -'

'ఎందుకు ?'

నిజంగా ఇది అర్థంలేని ప్రశ్న కాని రత్న పెదవులనుంచి వెలువడ్డ కారణంగా నేను జవాబివ్వాలి. 'ఎందుకేమిటి?.. ఎందుకేమిటి. నేను - నేను' అని ఆగిపోయాను.

ఇంకా ఏదో చెబుతానన్నట్లు నావంక కుతూహలంగా చూస్తోంది రత్న.

ఒక్కనిముషం ఆగి - ''ముందుగా కార్యక్రమాలను రూపొందించుకునే అలవాటు మీకు లేదు అయినా మీరు వచ్చేసరికి నేనూ బీచికి వచ్చాను. అంటే అర్థమేమిటి ?'' అనడిగాను.

రత్నముఖం కాస్త చిలిపిగా మారింది - 'ఒక పర్యాయం బీచికివస్తే మీరు నన్ను కలుసుకుని మాటామంతీ నా పరిచయాన్నభిలషించారు. మళ్ళీ బీచికి వస్తే మీరు నన్ను మళ్ళీ కలుసుకునే అవకాశమున్నదని తెలుసు అందుకే నేను బీచికి మళ్ళీ వచ్చాను. అంటే అర్థమేమిటి?'

ఉత్సాహంతో నాముఖం వెలిగిపోయింది. 'థ్యాంక్యూ వెరీమచ్'అన్నాను అర్థమైనట్లుగా

'మీరెందుకు థాంక్స్ చెప్పారో అర్థం కావడంలేదు నాకు. సముద్రమంటే విపరీతమైన ఇష్టంనాకు ఉన్నఊళ్ళో సముద్రముండాలే కాని ఏ దుష్టశక్తులూ నన్ను బీచికి రాకుండా ఆపలేవు. అలాగే ఆడపిల్లలవెనక పడడం మీకు అలవాటని నాకుతోచింది. ఈ అభిప్రాయానికి మీరు నాకెందుకు థాంక్స్ చెప్పారో అర్థంకావడంలేదు'

నా ముఖం పాలిపోయింది. ఒకక్షణం ఆలోచించి - ''నన్ను బాగా అర్థం చేసుకున్నందుకు చెప్పానండి -''అన్నాను. మళ్ళీఆగి - ''ఈఊళ్ళో ఇంకా చాలా మంది అమ్మాయిలున్నారు అయినా నేనెన్నడూ ఎవరివెంటాపడలేదు -''అన్నాను.

'ఆ విషయం ఋజువుచేయడం కష్టం' - అంది రత్న

'ఋజువులతో నాకు నిమిత్తంలేదు. నామనసే నాకు సాక్షి !''

'ఓహో అయితే ఆ మనసునే కవిత్వాన్ని

## సొ్ం రెంత ?-5

### "గుద్దు గుద్దుకీ డాలర్ల వాన!"

మహమ్మదీయ మతం పుచ్చుకుని కేషియస్ క్లే అన్న పేరు మార్చుకున్న ప్రపంచ హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్ మహమ్మదాలీ పత్యర్థి అను ముష్టి యుద్ధంలో ముక్కు పచ్చడి చేయడంతో పూరుకోడు ... నోరు కడుక్కొని యతి ప్రాసల సయితంగా తిడతాడు కూడా. కోట్ల కొలది డబ్బు ఆర్జించిన ఆలీ "రింగ్" లోపల వెలుపల కూడా 'స్కోర్' చేసిన ముష్టి యుద్ధ యోధుడు నల్ల వాళ్ళలోను తెల్లవాళ్ళలోను లేడు ... ఈ మధ్యనే 'ఆలీ' నేను రిటయిరై పోతున్నాను... దేవుడికి మతానికి అంకితమై పోతాను అంటూ ప్రకటనలు చేశాడు. "ది గ్రేటెస్ట్" అన్న శీర్షిక పెట్టి తన మీద ఒక సినిమా కూడా ప్రారంభించాడు కాని - డబ్బు చేదా అన్న సామెత రుజూచేస్తూ మళ్ళీ "రింగ్" లోకి దూకుతాను అని "ఛాలెంజీ" లు విసురుతున్నాడు. ఈ సారి ప్రఖ్యాత "బాక్సర్" "డ్యాన్ బాబిక్" మీద "చెయ్యి" ఝుళిపిస్తున్నాడు "క్లే !" [★★★]







# కలకాలం నిలచిన ఒక ప్రేమ కథ

అడిగిచూడండి మీరు నా వెంట పడడానికి కారణం నా అందమవునో, కాదో అని-'

దెబ్బతిన్నాను – 'అవును. మీ అందమే కారణం. తప్పేముంది?'

'తప్పేంలేదు. మీ ప్రవర్తనకు కారణం తెలియక మీరే తికమకపడిపోతూంటే నేను చెప్పాను.'

రత్న అందమైనదేకాదు. తెలివైనది కూడా. అనుకున్నంత సులభం కాదీమెతో వ్యవహరించడం, అయితే ఆమెకెలా తెలియబర్చడం - నేను దురుద్దేశంతో ఆమెవెంట బడడంలేదనీ జీవితభాగస్వామినిగా చేసుకోవాలనుకుంటున్నాననీ -

"మీరు చాలా తెలివిగా మాట్లాడతారు–' అని నవ్వి– 'సమవయస్కురాలైన స్త్రీకి సహృదయుడైన మగవాడిదగ్గర లభించేవి రెండేరెండు స్థానాలు. ఒకటిసోదరి. రెండు భార్య. వివాహం కానంతవరకు ఏస్త్రీ భార్య కానేరదు."

ఈ సబ్జక్టుమీద మాట్లాడ్డానికి రత్న కిష్టంలేదనుకుంటాను. సముద్రంవైపే చూస్తూ – 'ప్రేమఅనే పదం ఉచ్చరించదల్చుకునేవాళ్ళు ముందా పదానికి అర్థం తెలుసుకోవాలి-అలా తెలుసుకుంటే తమకా పదాన్నుచ్చరించే అర్హతలేదని చాలామందికి గ్రహింపవుతుంది-' అంది.

నా మనసులోని మాటకు రత్న విసిరిన సూటి సవాలు! నవ్వి 'ప్రేమకు అర్థం నాకు తెలియదు. అయినా నా అనుమానం నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానని!' ఇది నా సూటి మాట.

'ప్రేమకు అర్థం నేను చెబుతాను. ప్రేమకసాధ్యమన్నదిలేదు. నిస్వార్థబుద్ధితో తన కిష్టమైన వారికోసం ఏమైనా చేయగలుగుతాడు ప్రేమికుడు. ఉదాహరణకు ప్రేమ మిమ్మల్ని కవిగాకూడామార్చగలదు'అందిరత్న.

చాలా పెద్ద దెబ్బతీసింది రత్న. నేను తన్ను ప్రేమించడంలేదని పరోక్షంగా చెప్పింది. నాకుకోపం వచ్చింది. కానీ రత్నను చూస్తే సూర్యుడే చల్లబడిపోతాడు. నేనెంతవాణ్ణి?

* * *

మరి కొన్ని ప్రయత్నాలు చేసినా నేను కవిని కాలేకపోయాను కానీ బియస్సీ మాత్రం ఫస్టుక్లాసులో ప్యాసయ్యాను. ఎమ్మెస్సీలో సీటు వచ్చింది. ఇంకా రత్న హృదయంలో మాత్రం సీటు దొరకలేదు. కానీ ఆమెను నేను వదలలేదు.

కలిసినప్పుడల్లా ఏదో దెబ్బతీస్తూనే ఉండేదామె నా పైన. కానీ మా మధ్య సంభాషణ చాలాసేపు నడుస్తూండేది.

ఒక పర్యాయం ఆమెనాతో అన్నది-"మీరు చాలా పిరికివారు. ఇన్నిసార్లు నన్ను కలుసుకున్నారు గానీ ఒక్కసారైనా మా ఇంటికి రాగలిగారా?"

'ఆహ్వానం లేదుమరి–' అన్నాను చిరాగ్గా

"నాతో మాట్లాడమని ఆహ్వానించానా నేను–"

"లేదుకానీ ఇది బీచి. అందరి సొత్తు. ఇక్కడ మీరు నన్నేమీ చేయలేరు. మీ యింటి వద్దనైతే స్థానబలం–"

"అందుకే మీరు పిరికివాళ్ళన్నది"అంటూ నవ్విందామె

'అది పిరితనం కాదు, స్వార్థం!' అన్నాన్నేను.

'ఎలాగో చెప్పండి, తెలుసుకుంటాను?'

'మీ ఇంటి కొచ్చాననుకోండి. మీ నాన్నగారు నన్ను నాలుగు చీవాట్లేస్తారు. మీరు నవ్వుతారు. అవమానం అనిపిస్తుంది నాకు. బహుశా కోపం కూడా రావచ్చును. ఆ విధంగా మన కలయిక ఆగిపోవచ్చు. అలా జరగడం నా కిష్టం లేదు' అన్నాను.

'ఇప్పుడు నాకు బాగా రూఢి అయింది. మూర్తీభవించిన పిరికితనం మీదని' అంది రత్న.

'ఎలా?' అనడిగాను.

'అసలు మా నాన్నగారు మిమ్మల్ని చీవాట్లేయాల్సిన అవసరమేమిటే అంటాను. ఒక స్నేహితుడుగా మిమ్మల్నాయనకు పరిచయం చేస్తాను. ఆ విధంగా మీరు కనీసం మాకు కుటుంబ స్నేహితులు కావచ్చు–'

"మిస్ రత్నా! మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను-అందుకే మీ ఇంటికి రావడానికి భయంగా ఉంది—మీ ఇంటికి వచ్చి మీ నాన్నగారితో మాట్లాడుతూంటే దృష్టి మీ మీదనే ఉంటుంది. తప్పకుండా మీ నాన్నగారికి మీ ఇంటికి రావడంలోని నా ఉద్దేశ్యం తెలిసిపోతుంది-"

రత్న ముఖంలో చిరాకు కనబడింది. "మనసులో ఉన్న ఏదో అనుభూతికి ప్రేమ అని పేరు పెట్టడం అన్యాయం. ఇందాకా మీరన్నారు-మా నాన్నగారు మిమ్మల్ని చీవాట్లేస్తున్నప్పుడే నేను నవ్వితే కోపం వచ్చి నన్ను కలుసుకోవడం మానేస్తానని- ఊహలోనే ఆ మాత్రపు తిరస్కారాన్ని భరించలేని మీకు ప్రేమించడమన్నది సాధ్యమవుతుందా అనిపిస్తుంది నాకు–"

"చూద్దాం. నా ప్రేమ పెళ్ళికి దారితీసినప్పుడు తెలుస్తుంది-నా గొప్పతనం–"

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'ఇంధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

[illegible]

బూస్ట్‌ని పూర్తి మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్, కోకోలతో [illegible]

బూస్ట్‌లో, యిటువంటి మరే యితర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పాలు వున్నాయి. బూస్ట్‌లో మరింత ఎక్కువగా పాలు వున్నాయంటే, మీ పిల్లలు పెరగడానికి సమృద్ధిగా పోషక పదార్థాలు, మరింతగా సంతృప్తిగా లభిస్తాయన్నమాట. బూస్ట్‌లో ఎక్కువగా పాలు వుండటంవల్ల ఎక్కువగా చిక్కగా వుంటుంది. మీకు ఆ రుచి తెలుస్తుంది.

అంతేకాదు, బూస్ట్‌కి, మీ కుటుంబమంతా బాగా ఎంతో ఇష్టపడే మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన వున్నాయి. మీ రోజుని ప్రారంభించేందుకు యిది [illegible] మార్గం—ప్రతి రోజూ.

రెండు సైజులలో లభిస్తుంది.

**'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.**

## డాక్టర్ తాబేలు

కెన్యాకు చెందిన నైరోబిలోని ఓ ఆసుపత్రిలో ఓ పెద్ద తాబేలుందట. ఆ తాబేలు వీపు మీద కూర్చుంటే అలా కూర్చున్నవారి నడుంనొప్పి (వాతం కుంటే సంగతి) చేత్తో తీసినట్టు తగ్గిపోతుందట. ఈ తాబేలును అక్కడి డాక్టర్లు "డాక్టర్" అని ముద్దుగా పిలుస్తారట.

## బొమ్మలా శవం !

కాలిఫోర్నియాలోని లాంగ్‌బీచ్ పైక్ఎమ్యూజ్‌మెంటు పార్కులో ఓ మనిషిబొమ్మ వుందట. అది అచ్చం మనిషిలానే వుండేదిటచెప్మా అని చూపరులంతా మిక్కిలి ఆశ్చర్య పోతూండేవారట. ఇది అయిదేళ్ళనుంచి ఉన్నదటాపార్కులో. ఇటీవల ఆ పార్కులో "సిక్స్ మిలియన్ డాలర్ మేన్" అనే టెలివిజన్ సినిమా తీస్తుండగా సినిమా సిబ్బందిలో ఒకాయనాబొమ్మ చేతిని సవరించబోయేసరి కదూడి చేతికి చక్కా వచ్చిందట. తన చేతిలోవున్న ఆ చేతిని చూసి ఆయన నిర్ఘాంత పోయాట్ట. ఆ చేతిలోపల ఎముక వున్నదట. ఇదేమని పరీక్షించి చూస్తే అది ఓ మనిషి శవమట. ఆ శవాన్ని ఫ్లోరసెంటు రంగులతో పూసి చెడకుండా కుళ్ళకుండా వుండేలా చేసి, గాజుకళ్ళూ వగైరాలు పెట్టించారెవరో! అసలదెవరి శవం! ఎవరు ఆ పార్కులో దాన్ని వుంచారన్న విషయం మీద పార్కు అధికారులు విచారిస్తున్నారట.

### ఉన్నత స్థానానికి తొలి భారతీయుడు

హేగ్ అంతర్జాతీయ న్యాయస్థానానికి డాక్టర్ నరేంద్రసింగ్ అనే భారతీయుడు ప్రెసిడెంటుగా నియోగింపబడ్డారట. ఈ పోస్టుకు యింత పెద్ద అంతర్జాతీయ స్థానానికి ఎన్నికైన తొలి భారతీయుడటీయన.



### స్త్రీగా మారబోయిన పురుషుడు !

కలకత్తాలో ఓ యిద్దరు పిల్లల తండ్రి తనకు కడుపులో ఏదో బరువుగా ఉన్నదని, అస్తమానూ నొప్పివస్తోందని డాక్టరును సంప్రదిస్తే ఆయన పరీక్షించి కొయ్యబారి పోయాడట. అతనిలో స్త్రీ జననాంగము, తదితర స్త్రీ అవయవాలు కూడా జోరుగా ఎదుగు తున్నాయట. అవి బైటకు వచ్చి స్థిరత్వం పొందేలోగా వాటిని తీసివేసి, అతన్ని పురుషునిగా స్థిరపరచి అతని భార్యకు పతిభిక్ష పెట్టారట.

## కలకాలం నిలిచిన ఒక ప్రేమ కథ

"ప్రేమించే వాడెప్పుడూ ఆడదానిముందు తన గొప్పతనాన్ని నిలబెట్టుకునేందుకు ప్రయత్నించడు. అది అహంకారి స్వభావం. నిజమైన ప్రేమ అహంకారాన్నిముద్దుకోలేదు—" అని ఒక్క క్షణం ఆగింది రత్న— "మరో చిన్న విషయం సార్ ! ప్రేమిస్తున్నానని మీరనుకుంటున్నారు. ఇదే విషయాన్ని మీ తల్లిదండ్రులకు చెప్పినప్పుడేం జరుగనున్నదో ఎన్నీ ఆలోచించారా? అన్నింటికీ సిద్ధపడ్డారా?"

'ఆఁ' అన్నాను కానీ లోలుగా ఆలోచిస్తే అనుమానంగా ఉంది. ఇటువంటి విషయాన్ని విపులంగా నాన్నగారితో చర్చించగలనా నేను?

'అంత సులభం కాదనుకుంటాను. ఎందుకంటే నాబోటి మధ్యతరగతి ఆడపిల్లను చేసుకోడానికి ఈ సమాజంలో సాటి కులస్తుడైన యువకుడికే ఇబ్బందీ ఉండదు. సంకల్పబలం ఉండాలంతే! నిజం చెప్పాలంటే మీరు మీ నాన్నగారి నొప్పించి రేపు మా ఇంటికి వచ్చేరంటే -కట్న కానుకల విషయం నమ్ము బాటయితే-నా ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా మా నాన్నగారే ఓకే అనేస్తారు. మీ కంటికి కనిపించే అపురూప సౌందర్యం స్వంతం కావడం ఇంత సులభమని మీరింకా ఊహించి ఉండరు—' ఈ మాటలు రత్న నోటి వెంట బాధగా వచ్చాయి.

'అన్నీ నాకు తెలుసు!' అన్నాను ధీమాగా.

రత్న లేచి నిలబడి— 'మిమ్మల్ని లేచి సద్ద కలుసుకోవడమిదే ఆఖరుసారనుకొండి. ఎప్పుడైనా నన్ను కలుసుకోవాలనుకుంటే మా ఇంటికి రండి!' అంది.

* * *

మర్నాడు రత్న ఇంటికి వెళ్ళాను. రత్న ఇల్లు అలా గుండడం నాకు నచ్చలేదు. చాలా పాతబడిన ఇల్లది. అదీ స్వంతం కాదు. అద్దె ఇల్లని ఆమె నాన్నగారు చెప్పారు.

ఆ తల్లిదండ్రులకు రత్న ఒక్కతే కూతురు. కొడుకైనా కూతురైనా ఆమే వాళ్ళకి! అయినా సంపాదనకు మించిన ఖర్చుల కారణంగా రత్న తండ్రి అప్పులపాలై ఉన్నాడు. అతికష్టం మీద రత్న చదువు నడుస్తోంది. ఆమెనో ఇంటిదాన్ని చేయాలనుంది కానీ వేలకు వేలు కట్నం ఎక్కణ్ణించి తెచ్చేదీ—చదువుకుంటే ఉద్యోగమొస్తుందీ — ఉద్యోగముంటే అదే కట్నంగా భావించే వరుడు దొరక్కపోడు.

రత్న రూపానికి, ఆమె నివసించే వాతావరణానికీ పొత్తు కుదరలేదని పించింది. అయినా ఆ భగవంతుడి బుద్ధే ఇంత. బురదలో కమలాన్ని సృష్టించాడు. ఈ ఇంట్లో రత్నను సృష్టించాడు.

కమలం మీద అందరికీ మోజుంటుంది. కానీ ఆ.త మాత్రాన బురదనెవ్వరూ అంగీకరించలేరు. అంగీకరించినా భరించలేరు. బురదను మెచ్చేది పంది అవుతుంది నేను పందిని కాదు. పందినే అయితే కమలాన్ని ప్రేమించగలనా ?

రత్న తండ్రితో గడిపిన కొద్ది క్షణాలూ భయంకరంగా గడిచాయి నాకు. ఆయనకు విపరీతమైన వాగుడు. ఈ మధ్యకాలంగా నా మాత్రం ఓపిగ్గా ఆయన మాటలు విసే మనిషి దొరికుండడు. ఆ అవకాశాన్నాయన వదలదల్చుకోలేదు. దీనికి తోడు. రత్నతల్లి అతిథి మర్యాద పేరు చెప్పి కాఫీ ఇచ్చింది. ఆవిడ కాఫీ అని చెప్పకపోతే అదేమిటో నాకు తెలుసుండేది కాదు. తెలియకపోయినా ఫరవాలేదు. బాగుండి ఉంటే. ఆ కాఫీ నిండా బెల్లంరుచి. కాఫీపొడుంవేశారో లేదో తెలియదు గానీ అసహ్యకరమైన చెదు రుచి మాత్రం ఏదో ఉంది.

'వస్తానండీ!'అంటూ లేచాను, 'అప్పుడే!' అన్నాడు రత్న తండ్రి.

ఆయనకు క్షణాల్లాగున్నట్లుంది నాకు గడచినయుగాలు.

నేను వెళ్ళిపోబోతూంటే కూడా రత్న నవ్వింది—'కేవలం మిమ్మల్ని కలుసుకోవడం కోసం మీ ఇంటి కొచ్చాను—' అన్నాను.

'చాలా థాంక్స్— మళ్ళీ మళ్ళీ రాగలరని ఆశిస్తున్నాను—' అంది రత్న.

'కానీ మీరొక మాటైనా మాట్లాడ లేదు—'

'అది మన సాంప్రదాయానికే విరుద్ధం—'

నేను మాట్లాడలేదు.

'మళ్ళీ రేపు వస్తారా ?' అనడిగింది రత్న నా నుంచి జవాబురాకపోగా— "నాకు తెలుసు నిస్వార్థబుద్ధితో తన కిష్టమైన వారికోసం ఏమైనా చేయగలుగుతాడు ప్రేమికుడు. మీరెన్నడూ ప్రేమికులు కాలేరు. చిన్న చిన్న పనులు కూడా మీ వల్ల కాదు—' అంది రత్న కసిగా.

## వరకట్న నిర్మూలన

బీహారులో వరకట్న నిషేధాన్ని చట్టబద్ధం చేయడంతో ఎడిషనల్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ మిస్టర్ శివాజీ సిన్హా కట్నం తీసుకుని పెళ్ళిళ్ళు చేసుకుంటున్న నేరం మీద రెండొందల మూడు కేసులు నమోదు చేయడమేగాక, ఓ నూరు మందిని విజృంభించి అరెస్టు చేశారట.

## నెమళ్ల సందడి !

తాన్—ఎ—సలాప్ నగరంలో ఇందిరాగాంధి ఆ దేశపు ప్రసిడెంట్ భవనంలో పత్రికా ప్రతినిధులతో, మాట్లాడుతుండగా నెమళ్ళ కుప్పలు తెప్పలుగా వచ్చి కూతలు పెట్టనారంభించాయట. ఎన్ని సార్లు ఎన్ని విధాలా తరిమినా అవి ఆ చోటు, ఆ గోలా మాననందువల్ల యిహ లాభం లేదని ఆ సమావేశాన్ని సగంలోనే ఆపివేసుకోవాల్సి వచ్చిందట. కాకిగోల విన్నాం గాని నెమళ్ళ గోల ని వినలేదే!

## కందకు లేని దురద !

లండనులోని భారతీయులు టాక్సీనాపితే ఆ టాక్సీ ఆగకుండా పోతుందటక్కడ. కారణమేమిటంటే భారతీయులు "టిప్పు" లివ్వరట. అంతే గాక తమ దేశంలో భారతీయులు కుప్పలు తెప్పలుగా వచ్చి స్థిరపడి, దేశమంతా ఆక్రమించేస్తున్నారని టాక్సీ వారికో కసంట— అదేంటి! మధ్య అక్కడి ప్రభుత్వానికి లేని తాపం వారికేమిటి! కందకు లేని దురద కత్తిపీటకా! పుండున్ను.

## కుక్కల పెంపకంలో మిలన్ మహిళ ప్రైజు

మిలన్‌కు చెందిన వర్జీనియా అనే ఒకామె కుక్కలను పెంచుకోటంలో యావత్ప్రపంచంలోని వారినీ అవలీలగా అధిగమించి, తను చేరిన స్థానానికి ఎన్నడూ ఎవరూ చేర వీల్లేనట్టు చేసుక్కూర్చుందిట. ఈ 80 ఏళ్ల వర్జీనియా మూడు వేలారొందల కుక్కలను పెంచుతోందట. ఈమెకు యిల్లూ, వాకిలీ తప్ప భర్తా, పిల్లలూనా అనే వాళ్ళూ ఎవ్వరూ లేరట. అన్ని వేల కుక్కలకూ ఆహార పోషణ విషయం జాగ్రత్తగా చూసుకుంటూ అదే తన జీవిత లక్ష్యమని అడిగిన వారందరికి చెప్తోందట.

## కొడుకు శవం చూసి తల్లి మరణం

ఆంధ్రాయూనివర్శిటీలో లెక్చరర్‌గా పని చేస్తున్న సి. బి. యస్. శాస్త్రి అనే ఆయన హైదరాబాదు వచ్చి అక్కడ గుండె ఆగడంవల్ల చని పోయారట. ఈ విషయం విశాఖపట్నంలోని ఆయన కుటుంబానికి తెలియజేస్తే ఆయన తల్లిదండ్రులు చెల్లెలు వచ్చారట. బసులోపెట్టిన ఆయన శవాన్ని చూసి ఆయన తల్లి సుశీలమ్మ ఆ శవం మీదవాలి పోయిందట. స్పృహతప్పి పడిపోయిందేమోననుకుంటే కాదని, ఆమె చనిపోయిందని డాక్టర్లు ధృవపరిచారట.

---

రత్న తండ్రితో మాట్లాడ్డం చిన్న పనెలాగవుతుంది? కవినైనా కాగలను కానీ ఆయనతో మాత్రం మాట్లాడలేను.

* * *

రత్న బియస్సీ ఫస్ట్‌క్లాసులో ప్యాసయింది. నేను యమ్మెస్సీలో నాసబ్జక్టులో యూనివర్సిటీ ఫస్టుగా వచ్చాను. నా చదువైపోయింది. రత్న చదువయిందో లేదో నాకు తెలియదు. ఇద్దరం ఒకరి ఎడ్రసులు ఒకరు తీసుకున్నాం.

అయిదారు రిసెర్చి సంస్థలకూ, రెండు మూడు కంపెనీలకూ అప్లికేషన్లు పెట్టాను. మా ప్రొఫెసరుగారు రిసెర్చి చేయమని చెప్పారు. స్కాలర్‌షిప్ ఆఫర్ కూడా ఇచ్చారు. పనిలోపనిగా ఓ పాతిక అప్లికేషన్స్ ఫారిన్ యూనివర్సిటీలక్కూడా రాశాను.

ఓ రోజు తోచక రత్నకు ప్రేమలేఖ రాసి పోస్టుచేశాను. తన జోలికి రావద్దని జవాబిచ్చింది రత్న.

అమ్మా నాన్నా నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. పెళ్ళికూతురి అంతస్తు గురించి అమ్మ అభిప్రాయం అడిగి చూశాను. కనీసం పదిహేను వేల కట్నం ఎక్స్‌పెక్ట్ చేస్తోంది అమ్మ.

'ఎందుకమ్మా అంత డబ్బడిగి ఆడపిల్లల తండ్రుల కన్యాయం చేయడం ఒక పేదింటి పిల్లను వెతుక్కోవీ......'

అమ్మగుండె ఆగినట్లు కనబడింది. ఒక్క నిముషం ఆగి–'పేదింటి పిల్లను వెతుక్కోవడం కూడా ఎందుకు ? రోడ్డు మీద ఎక్కడ చూపినా వాళ్ళే–'' అంటూ ఈసడించింది.

నా గురించి రెండాఫర్లున్నాయట. ఇద్దరూ పదిహేను వేలిస్తామంటున్నారు. లాంఛనాల దగ్గర బేరాలు చేస్తున్నారు ఎవరు బాగా జరిపిస్తే వాళ్ళకి బేరం సెటిలైపోవచ్చు.

ఈ సంగతి రత్న కుత్తరంరాశాను. జవాబు వచ్చింది. నెలకు పదిహేను వందలు సంపాదిస్తున్న ఒక బ్యాంకు ఆఫీసరు తనని వివాహమాడ్డానికి ముందుకు వస్తున్నాట్ట.

నా కుడుకు మోత్తనం వచ్చింది. నాకు నచ్చిన నేను మెచ్చిన రత్న మరెవ్వరికి కాకూడదు, నాకే స్వంతం కావాలి. అందుకు నేనేమైనా సరే చేసేయాలి.

నాన్నగారితో మాట్లాడే ధైర్యం లేక అమ్మతో చెబుదామని వెళ్ళేను. ఎలా చెప్పాలో తెలియక సతమత మవుతుంటే ఆవిడే చెప్పింది. రేపు పెళ్ళి చూపుల నిమిత్తం ఏలూరు వెడుతున్నామట. అప్పటికి నేనింకేమీ మాట్లాడలేకపోయాను.

అమ్మాయి పేరు సుధ. బియ్యే ప్యాసయింది. బాగానే ఉంది. ఇల్లు ఇంద్రభవనం. ఇంట్లో మనుషుల మర్యాదలే వేరు. ఈ వాతావరణం నాకు నచ్చింది. ఒక్కసారి రత్న తలిదండ్రులు గుర్తుకు రాగా జగుప్సాభావం కలిగింది.

పిల్ల నచ్చిందా అని అమ్మ నన్నడిగితే నేనేమీ మాట్లాడలేదు. అమ్మ కూడా యధాలాపంగా అడిగిందే తప్పితే నా జవాబు కోసం ఎదురు చూసినట్లు కనబడలేదు. ఇలాగే ఇంకో పెళ్ళి చూపులూ జరిగాయి. ఆ అమ్మాయి పేరు రమ. ఆకర్షణీయంగానే ఉంది. ఇంటర్మీడియేట్ అయిందిట. మరి చదవకుండా వీణ నేర్చుకుంటోందిట. వాయిస్తుందేమో నని భయపడ్డాను కానీ శ్రావ్యంగా ఒకపాట పాడి ఊరుకుంది.

ఈ పెళ్ళికూతుళ్ళిద్దరూ రత్న ముందు దిగదుడుపనిపించింది. కానీ రత్న గురించి ఇంట్లో చెప్పడానికి భయంగా ఉంది. ఏం చేయాలో తెలియని పరిస్థితుల్లో మరో ఉత్తరం రాశాను రత్నకు అన్నీ వివరంగా రాస్తూ. జవాబు వచ్చింది–తక్షణం నన్ను వాల్తేర్ బయల్దేరి రమ్మనమని. ప్రొఫెసరు గారు రమ్మన్నారని వంకపెట్టి వాల్తేరు వెళ్ళాను. రత్నను కలుసుకున్నాను. ఇద్దరం బీచికిపోయాం.

'ఎందుకిలా నాకుత్తరాల మీదుత్తరాలు రాస్తున్నారో తెలియడం లేదు !' అంది రత్న.

'అర్థం చేసుకోగలరను కుంటాను–'

'నన్ను మీరు పెళ్ళిచేసుకొంటారా ?' అన డిగింది రత్న.

'ఆఁ' అన్నాను నమ్మకంగా.

'ఏం చేస్తారు–పెళ్ళిచేసుకుని !'

ఇదేం ప్రశ్న–పిచ్చి ప్రశ్న–అనుకున్నాను. నా మనసులోని మాటలు చదివినట్లుగా అంది రత్న. 'నాది పిచ్చి ప్రశ్న అనుకోకండి. నేను చాలా అందమైన దాన్ననేగదా మీరు వివాహం చేసుకోవాలను కుంటున్నారు. ఇంత అందాన్ని మెయింటైన్ చేయగల ఆర్థిక స్తోమతు మీకుందా అంటున్నాను–' అంది రత్న మళ్ళీ.

'అందాన్ని మెయింటైన్ చేయడం మీ బాధ్యత !'

'కావచ్చు. కానీ అందుకు ఖర్చవుతుంది గదా–'

## కలకాలం నిలచిన ఒక ప్రేమ కథ

'ఆ మాత్రం పొడర్నా, స్నోలూ కొన లేని వాణ్ణనుకుంటున్నారా ?'

'మీరు చాలా సింపుల్‌గా ఆలోచిస్తున్నారు. కేవలం అందం చూసి ప్రేమిస్తున్నారు మీరు. ఈ అందం ఇంత అందంగానూ ఉండాలంటే ఖరీదైన చీరలూ టాయిలేట్ సామాన్లే కాకుండా కాదు, నగలు లాంటి ఖరీదైన సాధనాలు కూడా అవసరం. ఇంత అందమైన భార్యను రోడ్డు మీద నడిపిస్తారా ? బడ్డీ షాపులోకి తీసుకెడతారా ? రూపాయి పావలా టికెట్లో కూచో పెడతారా ?–అలా చేయలేరు. అడుగడుగునా మీ ఖర్చు పెరుగుతుంది–'

"అది మీ అందంవల్ల పెరగదు. నా హోదాను బట్టి ఉంటుంది–"

"మీరు పొరబడుతున్నారు. ఈ రోజుల్లో మగవాడి హోదాను నిర్ణయించేది భార్యలే. మట్టిగాజుల్తో, నేతచీరతో పసుపు ముఖంతో కుంకుమ బొట్టుతో, మామూలు ఆకు జోళ్లతో కనపడె ఆడది గవర్నరు భార్య అయినా తెలియక పోతే ఆభర్తకు గౌరవం లభించదు. ఒక చేతికి వాచీ, ఒక చేతికి బంగారు గాజులు, చేతిలో మోడ్రన్ వ్యానిటీ బ్యాగ్, మాచింగ్ బ్లౌజ్‌తో సింథటిక్‌శారీ, ముఖానికి కోటింగ్, మాచింగ్ బొట్టు, కాళ్ళకు కాస్ట్లీశాండల్సు–ఇలా ఆడది షాపులో అడుగు పెడితే ఆ మగవాడికి అందరూ వంగి వంగి వందనాలు చేస్తారు. ఆ వందనాలూరికే రావు. వాటికి ఖర్చవుతుంది.'

'అవన్నీ ఇప్పుడెందుకు–మనం పెళ్ళి చేసుకుందాం' అన్నాను.

'ఇప్పుడే ఈ క్షణంలోనే పెళ్ళి చేసుకుంటే కాపురం పెట్టే స్టేజీలో వున్నానా?' అంది రత్న.

కోపం వచ్చింది. భయం వేసింది. జవాబివ్వలేదు.

ఆ తర్వాత నేను మళ్లీ రత్నను కలుసుకుందుకు ప్రయత్నించలేదు. ఆమెకు ఉత్తరం కూడా రాయలేదు. కానీ నెల రోజుల అనంతరం రత్నే నాకు ఉత్తరం రాసింది 'శరవైపేల కట్నంతో మంచి ఆఫర్ ఒకటుంది. చేసుకుంటారా ?' అని.

చేసుకుంటానని జవాబు రాసేసు.

తర్వాత ఉత్తరంలో 'అయితే నా విలువెంతని తేల్చేరు?' అనడుగుతూ ఉత్తరం రాసింది, పదిహేను వేల ఆఫర్‌ని కాదని రత్నను చేసుకుందుకు వెళ్ళాను గదా. ఇప్పుడు రత్న చెప్పిన ఇరవై వేల ఆఫర్ అంగీకరించాను కదా. అందుకని ఆమె అలారాసింది.

మీకు విలువ కట్టలేను. అని ఉత్తరం రాశాను. జవాబు లేదు. పది రోజులాగి మళ్ళీ వుత్తరం రాశాను. ఆమెను నే నెంతగా ఆరాధిస్తున్నానో అందులో వ్రాశాను. దానికీ జవాబు లేదు.

ప్రొఫెసర్‌గారు స్కాలర్‌షిప్ ఆఫర్ ఇచ్చేరు. వాల్తేరు వెళ్ళాను రీసెర్చి చేయడానికి. అన్నిటికంటె మొట్టమొదట నేను చేసిన పని రత్నను కలుసుకోవడం.

'నా ఉత్తరాల కెందుకు జవాబు రాయలేదు?' అనడిగాను.

'తర్వాత తెలుస్తుంది!' అంది రత్న.

'నెలకు మూడొందల యాభై రూపాయల స్కాలర్‌షిప్ వస్తుందిప్పుడు నాకు. నేను మిమ్మల్ని పోషించగలను. మీరు ఊఁ అంటే పెళ్ళికి ఏర్పాట్లు చేయించేస్తాను.' అన్నాను.

'నిజంగా?' అంది రత్న ఆశ్చర్యంగా.

'అనుమాన మెందుకు. ఈ క్షణమే బయల్దేరి రిజిస్ట్రారాఫీసుకి వెడదాం' అన్నాను.

'అయితే మీరు నన్ను బాగా ప్రేమిస్తున్నారన్నమాట' అంది రత్న

'పెళ్ళయ్యాక ఇంకా బాగా తెలుస్తుందా విషయం' అన్నాను.

'అయితే చిన్న మనవి' అంది రత్న.

'చెప్పండి!' అన్నాను.

'నన్ను మీరు నిజంగా ప్రేమిస్తున్న పక్షంలో నా గురించి ఒక్క పని చేయాలి నా పట్ల మీ రా ప్రేమను ఎప్పటికీ కలిగుండాలి. మనిద్దరికీ వివాహం కానప్పటికీ కూడా.'

'అదేమిటి?' అన్నాను దెబ్బతిని.

'ఏమీలేదు. మీకు ఉత్తరం రాయకపోడానిక్కూడా కారణ మిదే. నా పెళ్ళి నిశ్చయమైంది!' అంది రత్న.

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయో లేదో చూడ్డానికి నా కంటిలోతిరిగిననీళ్ళడ్డొచ్చాయి.

'మోసం!' అన్నాను.

'అలా అన కూడదు. మీకు పరిచయమైన ఈ అద్భుత సౌందర్యాన్ని మీరు మోసంగా తలవకూడదు. ద్వేషించరాదు. ఇది నా కోరిక. మీరునన్ను ప్రేమిస్తున్న పక్షంలో ఇదే మీ దగ్గరనుంచి నేను కోరేది' అంది రత్న.

'సినిమా డైలాగులు చెప్పొద్దు. మిమ్మల్ని నే నెంతగానో ప్రేమించాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకోలేకపోతే నా జీవితం వ్యర్థమనిపిస్తోంది—' అన్నాను.

'నిజానికి మీరు చెప్పిందే సినిమాడైలాగ్. సరిగ్గా అయిదు సంవత్సరాలు గడిచేక మీకు ఉత్తరం రాస్తాను. అప్పుడు మీరు హాపీగా మీ భార్యతో సంసారం చేస్తూంటారు. కానీ అప్పటికీ నా మీద ప్రేముంటుందో లేదో అన్న విషయం మాత్రం తెలియదు—'అంది రత్న.

'బహుశా రేపే నేనాత్మహత్య చేసుకోవచ్చు—' అన్నాను.

'వద్దు ప్రేమ ఏ హత్యలకూ ప్రేరేపించదు. హత్యలకు ప్రేరేపించేవి కామ క్రోధ లోభమోహ మద మాత్సర్యాలు. ఆత్మహత్య చేసుకుని మీది ప్రేమకాదని నాకు ఋజువు చేయవద్దు—'

'ఏమిటి—మీరు చెప్పే ప్రేమకు అర్థం—'

'ప్రేమించే వ్యక్తి సంతోషాన్ని మాత్రం కోరడం. ప్రేమించిన వ్యక్తి నుంచి ఏమీ ఆశించకపోవడం—అసలైన ప్రేమ అదే.'

'ఇంతకూ మీరు నన్ను ప్రేమిస్తున్నారా?'

రత్న మాట్లాడలేదు ఒక్క నిముషం తర్వాత—'కొన్ని కొన్ని జవాబులు ఇవ్వక పోవడమే మంచిది!' అంది. అదే నా ప్రశ్నకు జవాబు కావచ్చు.

తర్వాత రత్న పెళ్ళి శుభలేఖ అందింది నాకు. నేను పెళ్ళికి వెళ్ళలేదు. ఆనోటా ఈనోటా విన్నదేమిటంటే. రత్నకోటాశ ఉన్నాడనీ. అతగా డిటీవలే ఫారిన్ నుంచి వచ్చాడనీ...

* * *

'ప్రియమైన స్నేహితునికి,

అన్న ప్రకారం అయిదు సంవత్సరాల అనంతరం ఉత్తరం రాస్తున్నాను.

ఒకనాడు నేను చెప్పాను గదా నాది ఖర్చులో మెయిన్‌టైన్ చేయవలసిన అందమని. నా భర్తకా ఆర్థిక స్తోమతుంది. నే నిప్పుడు కారులో తిరుగుతున్నాను. సొసైటీలో రాణిలా బ్రతుకుతున్నాను. నలుగురూ నన్నుచూసి అసూయపడే హోదాలో ఉన్నాను.

నా భర్తకు నేనంటే ఇష్టంలేదని చెప్పలేను. ఆయన సంపాదన అంతా నా గురించే. ఆయన జీవితం నా కోసమే. అయితే ఆయన నా గురించి ఎంతో సమయం వెచ్చించలేరు. వెచ్చించినా అందుకునే తీరుబడి నాకులేదు. ఇద్దరం ఎప్పుడూ హడావుడిగా ఉంటూ హడావుడిగా కలుసుకుంటాం. మెకానికల్‌గా రొటీన్ లైఫ్ నడుపుతూంటాం.

ఇటువంటి జీవితాన్నే నేను కోరుకున్నది. మా బావ నాకిటువంటి జీవితాన్ని ప్రసాదిస్తాడని నాకు ముందు నుంచీ తెలుసు. అందుకే మీ జీవితానికి కొంత దగ్గరగా వచ్చి మీలో ఆశలు రేపాను.

నా జీవితం తృప్తిగానే గడిచిపోతోంది. కానీ అన్నింటికీ మించిన తృప్తి ఏమిటో తెలుసా? నా అందాన్నారాధించే వ్యక్తులు కొందరింకా ఈ ప్రపంచంలో మిగిలి ఉన్నారని.

## ఏం చేస్తావ్ బ్రదర్?

— కొండముది శ్రీరామచంద్రమూర్తి

నువ్వు నమ్మిన వాళ్ళే నీ చుట్టూ ఉచ్చులు బిగించి
నిప్పుల ప్రశ్నలను బదులు పిస్తే కత్తుల
శిలావర్షం కురిపించి
నీకు వైఫల్యాలను, మానసిక వైక్లబ్యాలను
నిన్ను కారణం చేసి
దుంపా దీపం వెలగని చీకటి ఇంట్లో నిన్ను
ఒంటరిగా వదిలేస్తే
నువు చిత్తవృత్తిని ప్రదర్శిస్తావా ?
ఉపహాండవ వధకే ఉపక్రమిస్తావా ?
ఏం చేస్తావ్ బ్రదర్ ?

* * *

నీతో తిరిగినవాళ్ళే ఎక్స్‌రేకళ్ళతో నిన్ను పరికించి
నీవు సర్వజీవన రుగ్మతలుగా నిన్ను వర్ణించి
స్నేహవృక్షం పేరిట ఎడారిమధ్య నిన్ను దిగవిడచి
దిగంతం వరకే నిస్సహాయుడుగా నిను బ్రతకమంటే
నిరవ నిశ్శబ్ద వస్త్రంలో ముసుగుసితావా ?
నిద్రలేమి ఉగ్రసింగ్గై పాటలు గొడతావా ?
ఏం చేస్తావ్ బ్రదర్ ?

* * *

ఆకలి ఆత్మఘోష అన్నిచోట్లా వేదంలా వినబడినప్పుడు
దోపిడీలే పగలు రాత్రి దొరతనం సాగించినప్పుడు
హేతువాదం ఏడుకట్ల సవారీపై ఊరేగినప్పుడు
మతోన్మాదం సగటు మనిషికి బ్రెయిన్‌వాషింగ్
చేసినప్పుడు
బుద్ధవాక్యమే మంచిదంటావా ?
క్రుద్ధ సర్పమై కాటు వేస్తావా ?
ఏం చేస్తావ్ బ్రదర్ ?....ఏం చేస్తావ్ ?

**7-1-1977** శుక్రవారం మొదలు
**13-1-1977** గురువారం వరకు

# వారఫలం ★

**మేషం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం: —** అనుకూలమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు—వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మిధునం: —** రావలసిన డబ్బు అందు తుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కర్కాటకం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనసంగల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలించగలవు. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**సింహం :—** సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందు తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులుయేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగు తుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల :—** ప్రయోజనసంగల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ప్రయాణాలకు గురి కాగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలు వింటారు.

**వృశ్చికం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — పుణ్య కార్యాలు చేస్తారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు :—** వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మటం తగదు. చికాకులు యేర్పడతాయి. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు బాగుంటాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**మకరం :—** మీ ప్రయత్నాలు నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో శ్రమ కలుగు తుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు — వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. అనవసరమైన వ్యయం జరుగు తుంది.

**కుంభం :—** పోటీవారిలో మాట పట్టింపులు తగవు. మీ కార్యక్రమాలు మార్పులువస్తాయి. రావలసిన డబ్బు అందు తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం ఆఖరులో ఫలితం లేని శ్రమ కలుగు తుంది. స్త్రీలకు-ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమకలుగు తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాసవస్తువులు కొంటారు.

— మహేష్

## రాలిన ముత్యాలు

—శ్రీ సోమసుందర్—

మైకుల నిండా సినీ మైకం...
గ్లాసుల నిండా పచ్చరెక్కల కలకలం..
సాయంత్రాలనిండా ధూమాయం తారవం
అర్ధరాత్రులు క్లబ్బుల్లో నింపే
గార్దభగానం...

## కలకాలం నిలచిన ఒక ప్రేమ కథ

ఒకతను కవి. అతని ప్రతి గేయంలోనూ నేను కనిపిస్తాను. అతనికి తెలుగుదేశంలో చెప్పుకోదగ్గ పేరే ఉంది. ఆ పేరుకు నా రూపమే కారణమని ఇప్పటికీ అతనంటాడు.

రెండో అతను మీరు. మీరు నా అందాన్నింకా ఆరాధించడానికి కారణం. నేను మీ దాన్ని కాకపోవడమే.

ఏ అందమైనా ప్రేమించి ఆరాదించబడాలంటే ఆ అందం అందకూడదు. ఈనా వాక్యానికి సాక్ష్యంగా దేశంలోని దంపతు లందరూ నిలబడతారు.

పెళ్ళి చేసుకుని సుఖపడాలన్నది నా కోరిక. ప్రేమించి ఆరాధించబడాలన్నది నా జీవితాశయం. రెండోది నెరవేరడం కోసం మీతోనూ ఒక కవితోనూ స్నేహం చేశాను. మీ మంచితనానికి లొంగి పోకుండా అంతులేని నిగ్రహాన్ని చూపాను. బావను పెళ్ళి చేసుకున్నాను. నా కోరిక తీరుతోంది. జీవితాశయం నెరవేరుతోంది.

మీ జీవితం సాఫీగా నడిచి పోవాలని తలుస్తాను.

ఎల్లప్పుడూ మీ స్నేహంకోరే,
రత్న'

ఈ ఉత్తరం ఇంటి అడ్రస్‌కు వస్తే నాన్నగారు నా ఆఫీసుకు రీ డైరెక్టు చేశారు. ఉత్తరంలోని విశేషాలు చాలా ఆశ్చర్యం కలిగజేశాయి. రత్న నాతో పరిచయాన్ని కొనసాగించిన కారణం విచిత్రంగా ఉన్నప్పటికీ నిజమే అని తోస్తోంది.

మూడు సంవత్సరాల క్రితం శోభను నేను పెళ్ళిచేసుకున్నాను. శోభ చాలా అందమైనది. మొదట్లో ఆమె లేకుండా క్షణం గడిచేది కాదు. ఆమెలో ప్రతిక్షణం మధురంగానే ఉండేది. ఇప్పుడల్లాకాదు ఆవేశాలు కాస్త చల్లారాయి. శోభంటే నాకిష్టమే. ఆమెను ఎదులుకోడానికిష్టపడను. కానీ మొదట్లో ఉండే ఆరాధనలేదు. ఆ ఆరాధన ఇప్పటికే రత్నపట్ల ఉంది.

ఇంతగొప్ప జీవిత సత్యాన్ని అంత చిన్నతనంలో ఊహించి నెరవేర్చుకోగలిగిన రత్నపట్ల నా ఆరాధన మరికాస్త పెరిగింది.

# క్షారకేస

## మురాల ఇందిరారఘు

*(గత సంచిక తరువాయి)*

మాలతి చిన్నప్పటి నుంచి ఒక గృహిణిగా బిడ్డా పాపలతో ఎల్లప్పుడూ భర్త సన్నిధిలో వుండాలని ఎన్నో కలలు కన్నది. కాని విధి చాలా విచిత్రమైనది అనుకున్నవి అనుకున్నట్లుగా జరుగనీయదు మరి. అలా జరిగితే మానవుని మనుగడ మరొక విధంగా వుండేది కదా! కాని మన చేతుల్లో ఏమిలేదు జరిగేది జరగక మానదు! అని నిరూపించింది. మాలతి జీవితంలో మాత్రం. ఎన్నో ఆశలతో వూహించిన తన బాల్యం గుర్తుకు రాగానే మాలతికి ఎక్కడలేని బాధ కల్గుతుంది.

మాలతి తండ్రి ఒక తహశీల్దారు. ఎంతో అందంగా వున్న మాలతి అంటే అందరికీ అపురూపం. ఆ వూళ్లోనే పని చేస్తున్న బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరుగారి అబ్బాయి రఘు, మాలతి ఎంతో స్నేహంగా వుండేవారు. రఘు చాలా చురుకైన వాడు. స్కూల్లో అన్నీ అతనివే ఫస్టు మార్కులు. మాలతి అన్నిట్లోను సామాన్య విద్యార్థిని. "మాలతీ! ఎందుకని శ్రద్ధగా చదవవూ" రఘు అన్నాడు ఒకనాడు.

"రఘూ మన మిద్దరం పెండ్లి చేసుకుందామా?" మాలతి మాట మార్చింది.

"నేను నీ చదువు గురించి అడుగుతుంటే?" రఘు మరల మొదటి ప్రశ్నే వేశాడు.

"ఏమో రఘు, నాకు చదవాలని లేదు. చదివి మాత్రం ఏమి చేయాలి? నీవు చదివితే చాలు లెద్దూ" మాలతి జవాబు చెప్పింది.

టెన్త్ క్లాస్‌లో క్లాస్ వచ్చింది రఘుకి. మాలతి పరీక్ష పోయింది. తను పాస్ కాక పోయినా రఘు పాస్ అయినందుకు మాలతి ఎంతగానో సంతోషించింది.

రఘు ఇంటర్‌లో చేరాడు కాలేజీ నించి ఇంటికి రాంగానే మాలతి రఘు వాళ ఇంటికి వెళ్ళి యిద్దరూ కేరమ్సుగాని చెస్ గాని ఆడుకొనేవారు.

రఘు కాలేజీలో జరిగే వింతలు చెప్పేవాడు. "నీవు కూడా టెన్త్ పాస్ అయితే చక్కగా కాలేజీకి వచ్చేదానివిగా" మాలతితో అన్నాడు రఘు.

"నేను కాలేజీలో చేరితే, ఇలా జరిగిన వింతలు నీవు చెప్పవుగా రఘూ" అనేది మాలతి.

"మాలతీ నీవు ఎంత అమాయకురాలవు' అనేవాడు రఘు.

ఇద్దరూ సరదాగా గడిపేవారు కాలం.

మాలతి తల్లి పార్వతమ్మ "అలా పెద్దదానివి అయినా ఆ రఘుతో ఏమిటే ఆ పకపకలు వికవికలు" అని విసుక్కునేది.

"మీ నాన్నగారిని నీకు పెండ్లి చేయమంటే నిమ్మకి నీరెత్తినట్లు వుంటారు" అంటూ పార్వతమ్మ ఆవేదన వెల్లడించేది.

తొలి వలపే తీయనిది అనే విధంగా సాగుతున్నాయి మాలతి మనసులోని వూహలు.

"ఇక నుంచి నీవు రఘూ వాళ్ల ఇంటికి వెళ్లటానికి వీలులేదు. అన్ని మన రోజులా, ఆ అబ్బాయి ఏదైనా అఘాయిత్యం చేస్తే ఏమి కావాలి" ఆంక్ష పెటింది పార్వతమ్మ.

"అమ్మా, నేను రఘుని చూడందే ఉండలేను" అంటూ ఏడ్చింది మాలతి.

కొందరు తల్లులు బిడ్డలను గుండెల్లో పెట్టుకుని కాపాడతారు. అమృత వర్షం కురిపిస్తారు. కొందరు అందుకు విరుద్ధంగా వుంటారు. తన కూతురే తన పాలిట శత్రువుగా తలచే తల్లులు లేకపోలేదు యీ లోకంలో.

"అమ్మా నేను రఘుని చూడకుండా వుండలేను. నా మనస్సు అతనికే అంకితం చేశాను" మాలతి మనస్సు విప్పి చెప్పింది.

"మనస్సు వాడికిచ్చావా తల్లీ!" వెటకారంగా అంది. "ఇస్తే తిరిగి తీసుకో తల్లీ" వెక్కిరింపుగా అంది పార్వతమ్మ రెచ్చిపోయినట్లు, "వాడో రౌడీ వెధవ వాడి అమ్మకి పెద్ద ఘరానా' అంది. ఆఫీసరు తనే అయినట్లు ఫోజు పెట్టి పార్వతమ్మ.

> *జరిగినకథ 1 :* నా అదృష్టం పగవారికి కూడా వద్దన్న సి. సీతార
> మాలతి మాటలు అర్థం కావు దమయంతికి. దమయంతి భర్త ప్రకాష్. అత్త వర్ధనమ్మ.

రఘు తల్లి శాంతమ్మ తనకు పెద్దగా విలువ యివ్వదనే పార్వతమ్మ ఈ అక్కసంతా అంతలో రఘు తల్లి శాంతమ్మను చూసి "అత్తయ్యా" అంటూ శాంతమ్మ కౌగిట్లో ఒరిగిపోయిన మాలతిని యివతలకు లాగింది పార్వతమ్మ.

"ఏమ్మా శాంతమ్మ తల్లీ ఇంకా ఏమి మిగిలిందని వచ్చావు, నా కూతురు మనసు మార్చావు, ఇంకా ఏమి చేద్దామని వచ్చావు. ఇకనుంచి అయినా మమ్మల్ని యిలా బ్రతకనియ్యమ్మా."

"అత్తయ్యా" అంటూ మాలతి శాంతమ్మను వెళ్ల నివ్వలేదు. కాని పార్వతమ్మ ముందు ఆమె ఆప్యాయత పని చేయలేదు.

"నీతి జాతి వున్న దానివైతే నీ కొడుకును నా కూతురుతో మాట్లాడకుండా చూడు" అంది పార్వతమ్మ ఆఖరిసారిగా.

జరిగిన అవమానానికి ఆవేదనతో ఇంటికి వెళ్లిపోయింది శాంతమ్మ.

"అమ్మా నీవు మనిషివేనా? నీకు మనస్సు అనేది వుందా? నీవు నల్లరాతి బండవు. కఠిన శిలా విగ్రహానివి. నీలో ప్రవహించేది రక్తం కాదు విషం. శరీరంలో అణువణువునా కాలకూట విషం వుంది. నిన్ను మనిషిగా పుట్టించి నాకు నిన్ను తల్లిగా చేసిన ఆ భగవంతుడికూడా దయలేదు. డబ్బు, అధికారం వుందనే అహంకారంతో, కళ్ళు పూడుకుపోయి, దేవతవంటి శాంతమ్మ అత్తయ్యను నీ నోటి కొచ్చినట్లు అన్నావు. సాటి స్త్రీగానైనా ఆమెను గౌరవించావా?

ఛీ! ఛీ! నీలో ఇంత నిరంకుశత్వం వుందని తెలిస్తే, రఘుతో స్నేహం చేసేదాన్నేకాదు. నా మూలంగా శాంతమ్మ అత్తయ్య అవమానంపాలు అయ్యే దేకాదు" ఆగని కన్నీటితో తన గదిలోకి వెళ్ళిపోయింది మాలతి.

పార్వతమ్మ మాలతికి ఎన్నో సంబంధాలు చూసింది. అంతలో అనుకోని విధంగా పార్వతమ్మ భర్త గుండెపోటుతో చనిపోయాడు.

శాంతమ్మ వాళ్ళు వేరే వూరు బదిలీఅయి వెళ్లిపోయారు.

రఘు మెడిసిన్‌లో చేరాడు.



## ఓతార కథ

మాలతి రఘును గురించిన ఆలోచనలు మాన్పుకోలేకపోయింది.

పార్వతమ్మ దూరపు చుట్టాలలో ఒకరు ఒక సంబంధం తెచ్చారు. అతను ఒక జమిందార్ అని, పిల్ల నచ్చితే కట్నంలో పని లేదని, చెప్పారు.

పార్వతమ్మ వెంటనే పెళ్ళి చూపులు అవీ చకచక పూర్తి చేయించింది. తనకు కాబోయే అల్లుడి వైభోగాన్ని చూసి మురిసిపోయింది.

రఘు కావస్తుడు ఇంక ఎవరైనా ఒక్కటే! మాలతికి పెండ్లి ముందు ఒక్కసారి రఘుతో మాట్లాడాలని తన కోరికను తల్లికి చెప్పింది.

"అమ్మా" ఒక్కసారి శాంతమ్మ అత్తయ్యగారిని చూసి వెంటనే బస్సులో వచ్చేస్తాను" అని ప్రాధేయ పూర్వకంగా అడిగింది మాలతి.

"అయ్యో తల్లి! శాంతమ్మ దగ్గరకు వెళితే నాకు నిన్ను దక్కనిస్తుందా ఇంక ? అంతగా వెళ్ళాలని వుంటే పెండ్లి అయిన తరువాత వెళ్ళుదువుగానిలే" అంటూ మాలతి కోరికను నిరాకరించింది పార్వతమ్మ.

జమిందార్ గంగాధర్‌తో వివాహం జరిగి పోయింది. జమీందార్లతో వియ్యమందుకున్న పార్వతమ్మకి తనేదో ఎవరెస్టు శిఖరము ఎక్కి నట్లుగా గర్వపడసాగింది.

మాలతికి జమిందార్ గంగాధర్ గారు పెట్టిన నగలు, చీరలు చూసి కూతురు ఎంత అదృష్టవంతురాలో అని మురిసిపోయింది పార్వతమ్మ.

డబ్బు, మాత్రమే మనుషులను సుఖపెట్ట లేదు.

ఆ రోజు మొదటి రాత్రి అమ్మలక్కలు మాలతిని భూలోక సుందరిగా ముస్తాబు చేశారు. గదిలోకి అడుగు పెట్టిన మాలతికి, అగరవత్తుల సువాసనలు, విరజాజుల సౌరభాలు. పెద్ద మంచం, దాని మీద పాలనురుగువంటి తెల్లటి దుప్పటి, దానిమీద పొన్నపువ్వులతో "స్వీట్ నైట్" అని ఎంతో అందముగా పేర్చ బడి వున్నాయి.

మంచం పైన పందిరికి మల్లెలు. విర జాజులు, దవనంతో అల్లిన మంచం చూసే సరికి మాలతికి రఘు గుర్తుకు రావటంతో ఎంతో నిరాశ కలిగింది. ఇంక తను రఘుని మర్చిపోవాలి, "తనవల్ల అవుతుందా" అను కుంది. అర్ధరాత్రి ఒంటిగంట అయిపోయింది. గంగాధర్ మాత్రం ఇంటికి రాలేదు. పనివాడు వచ్చి "అమ్మా అయ్యగారు రావటానికి ఆలస్యం అవుతుంది, మీరు నిద్రపొండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన తరువాత "నా లాగా వారికి కూడా ఇష్టంలేని పెండ్లి అయి వుంటుంది" అనుకుంది మాలతి.

మాలతి మంచి నిద్రలో వుంది భర్త గంగాధర్‌ని అతని తల్లి తిడుతున్న కేకలకు మెలకువ వచ్చింది.

"బంగారం వంటి భార్య ఇంటిలో వుండగా నీ వెధవ బుద్ధి పోనిచ్చుకున్నావు కావు" బాదగా గంగాధర్ తల్లి తులశమ్మ అంది.

"ఏమిటమ్మా నీగోడవ. భార్య ఎప్పుడు వుండేదే ఎక్కడి పోతుంది. వూర్లోకి వచ్చిన క్రొత్త కేసువదిలితే మళ్ళీదొరుకుతుందా?." అని త్రాగినమత్తులో ఏమేమొ వాగుతున్న కొడుకును ఏమిఅనలెక "ఎవరి నొసటలో ఏమి వ్రాసి వుందో" అంటూ ఒకనిట్టూర్పు

# బ్రూ: ప్రత్యేక రుచి, సరియైన చిక్కదనం




దక్షిణాదిన మేటి అయిన బ్రూ అతిత్వరగా
భారతదేశపు అభిమాన ఇన్‌స్టెంట్ అవుతుంది

OBM-4756A/2 TEL




## పరిమితమైన స్వేచ్ఛ

భారతదేశంలో విదేశీయుల పరిపాలన అంతరించి స్వాతంత్ర్యం లభించిన తర్వాత ప్రతిభారతీయుడూ స్వతంత్రుడయినాడు. 'నాకు యిప్పుడు స్వేచ్ఛ లభించింది' అని అందరూ అనుకోవచ్చును. 'స్వాతంత్ర్యం అంటే ఏమిటో' అర్థం చేసుకోలేనివాళ్ళు ఆ స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకుని తాము బాధపడడం కాకుండా యితరులకు కూడా బాధను కలిగిస్తారు.

ఒకడు టిక్కెట్టు కొనే అనుకోండి. రైలు ఎక్కాడు. అతడు ఎక్కిన పెట్టెలో ఒక బల్ల కాళీగా ఉన్నది. తలకింద చీతిసంచీ పెట్టుకొని కాళ్ళు చాచుకుని అతడు హాయిగా పడుకున్నాడు. ఇంతలో మరొక ప్రయాణికుడు ఆ పెట్టెలోనే ఎక్కాడు. ఎక్కడా కాళీ లేదు. అతడు మొదటివ్యక్తి పడుకున్న బల్ల దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. అతడు తెలివిగా ఉన్నా లేచి కూర్చోలేదు. "అయ్యా! కూర్చుందికి కాస్త జాగా యివ్వండి" అని రెండోవ్యక్తి ప్రార్థించాడు. లతడు లేవలేదు. "రాత్రల్లా నిద్రలేదు. ఇప్పుడే కాస్త నడుం వాలిస్తే లెమ్మంటా వేమిటయ్యా? ఈ మాత్రం స్వేచ్ఛ నాకు ఉండకూడదూ? నేను రైల్వేవారి దత్తపుత్రుల్లాగ టిక్కెట్టు లేకుండా ప్రయాణం చెయ్యలేదు చాలా దూరం వెళ్ళాలి కూడా" అని సమాధానమిచ్చాడు. "ఇవి కూర్చునే బల్లలు కాని, పడుక్కొనేవి కావుగదా! కొంచెం జాగా యివ్వమంటే కాళ్ళు నిగడదన్నుకుని పడుక్కోవడం భావ్యమా?' అని అంటే "నేను వచ్చేసరికి కాళీగా వుంది. పడుక్కున్నాను, ఎవ్వర్నీ లేచిపొమ్మని చెప్పి ఆక్రమించలేదు. మీరు మొదటవస్తే ఇలాగే చేస్తారు' అని మొదటి ఆసామీ జవాబు, ఇదీ వరస.

దేశం స్వతంత్రమయింది. సరే అందుకని దేశంలో అందరూ స్వేచ్ఛగా ఇచ్ఛవచ్చినట్టు ప్రవర్తించడం తగదు. వాక్స్వాతంత్ర్యం. వున్నదని నోటికి వచ్చిన కూతలు కుయ్యగలమా? స్వేచ్ఛకు కూడా ఒక అవధి ఉండాలి నీవు స్వేచ్ఛను అనుభవిస్తూ ఉన్నా ఇతరులకు కూడా అట్టి స్వేచ్ఛ ఉన్నదని గ్రహించాలి. ఇతరుల స్వేచ్ఛకు భంగం కలగనంత వరకూ తాను స్వాతంత్ర్యం అనుభవించవచ్చు. హద్దు మీరితే తనకే కష్టం కలుగుతుంది: నేను స్వేచ్ఛగా నడుస్తానని రోడ్డు మధ్య నడుస్తే ముందు వెనుకల వచ్చే వాహనాలకూ, బాటసారులకూ శ్రమ కలుగుతుంది. దానితోపాటు తనకున్నూ అపాయం కలుగుతుంది. స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నా కొన్ని నియమ, నిబంధనలకూ కట్టుపడి ఉండవలసినదే! రాజ్యయంత్రాంగాన్ని త్రిప్పుతున్న మహానాయకులు కూడా నిబంధనలనూ, నియమాలనూ అతిక్రమించి నడుచుకోలేదు.

కేవలం తన స్వేచ్ఛనే కోరుకొనేవారు తెగిపోయిన గాలిపటంమాదిరిగా ఏమూలకు చేరుతారో చెప్పడం సాధ్యం కాదు.

స్వేచ్ఛకు కూడా ఒక పరిమితి ఉండాలి.

---

విడిచి తులశమ్మ క్రిందకు వెళ్ళిపోయింది.

మాలతికి అర్థం అయిపోయింది. "తన భర్త ఒక త్రాగుబోతు, స్త్రీలోలుడు అని. అందుకే జమిందారు అయివుండీ ఒక సామాన్యురాలిని చేసుకున్నాడు" అనుకుంది.

తెల్లవారింది వరస అయినవాళ్ళు మాలతిని రాత్రి కబుర్లు చెప్పమని అడగటం మొదలు పెట్టారు. కానీ తనేం చెప్పగలదు తను నటి అయితే ఏదో చెప్పేది. కాని నిజ జీవితంలో అబద్ధం ఆడటం అంతతేలిక అనిపించ లేదు.

"రఘుని కాదని యితన్ని చేసుకున్నందుకు తనకు తగిన శాస్తి జరిగిందని చెప్పతుందా? తన భర్త ఎక్కడో నాలుగ్గంటలు గడిపి పూర్తిగా త్రాగి వచ్చాడని చెప్పాలా? లేక

## ఓతార కథ

అనాదిగా ఆడదానికి జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టమని అంటుందా? ఎవరికి ఏమిచెప్పాలో తెలియని స్థితి. ఏమిచేయలేని మాలతి ఏమి మాట్లాడకపోయే సరికి అందరూ సిగ్గు అనుకున్నారు.

మాలతి అత్తగారు తులశమ్మమట్టుకు "నాపరువు నాకొడుకుపరువు కాపాడమని, రాత్రిలా జరగకుండా తనుజాగ్రత్త పడతానని" హామీ ఇచ్చింది.

అత్తగారి ఔదార్యం మాలతిని మంత్రముగ్ధురాలిని చేసింది. అంతకన్నా ఆ దశలో ఆమెకు దొరికే తృప్తి ఏముంది!.

పార్వతమ్మ మాత్రం, వాళ్ళ ఇల్లు, వైభోగం చూసి ఎంతో మురిసి పోయింది. మాలతి గుండెల్లో ఆరని మంటలు పార్వతమ్మకు అర్థంకావటంలేదు.

రెండోరోజు గంగాధర్‌ని "ఆపిల్ల ఏమిటనుకుంటుంది! ఈ రెండు రోజులూ, చూట్టాలు వాళ్ళూ వున్నంత కాలం అయినా త్రాగుడూ ఆ తిరుగుడూ మానరా నాయనా" అని బ్రతిమాలింది తులశమ్మ. ఏ దేవుడు కరుణించాడోగానీ గంగాధర్, ఆరోజు ఇంటి పట్టునే వున్నాడు.

మాలతి పరువం, గంగాధర్ చేతిలో నలిగి పోయింది. గుండెల నిండా రఘుని నింపుకొని వున్న మాలతి ఒక గాజు బొమ్మలాగా గంగాధర్‌తో కాపురం చేసింది.

(ఇంకా వుంది)

# * సినిమా విశేషాలు *

### సంక్రాంతి బల ప్రదర్శనం

రాబోయే పండుగ నెలలో చిత్ర సింహాలు ఢీకొంటున్నాయి. అక్కినేని... వాణిశ్రీ నటించిన లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్‌వారి "చక్రధారి", నందమూరి... శారద నటించిన రామకృష్ణ సినీ స్టుడియోస్‌వారి "దాన... వీర... శూర... కర్ణ", శోభన్... జయప్రద నటించిన "ఈ తరం మనిషి", కృష్ణ... జమున నటించిన మాధవీ... పద్మాలయా కంబైన్స్‌వారి "కురుక్షేత్రం", చిత్రాలన్నీ పండుగ సంబరాన్ని పంచుకునేందుకు వుత్సాహపడుతున్నాయి.

ఈ పండుగ నెల విశేషం ఏమిటంటే... రాబోయే చిత్రాలన్నీ వెరైటీ కథలను గొనివున్నాయి. అన్నీ భారీ వర్ణ చిత్రాలు కావడం మరొకటి.



'కల్పన'లో జయచిత్ర

"బిగ్‌ఫోర్" నటించడం మరొకటి. ఒక నటుడు మూడు పౌరాణిక పాత్రలను పోషించడం. ఒక చిత్రం సినిమాస్కోపులో రూపొందడం.

మనసున్న మన ప్రేక్షకులు, పండుగ చిత్రాలను మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తే, మన పరిశ్రమ పచ్చగా వుంటుంది.

### కుమార్ తీసుకున్న నిర్ణయం

మారుతీ ప్రొడక్షన్స్‌కు లక్ష్మికుమార్ అధినేత. ఆయన రెండు భారీ వర్ణ చిత్రాలను శోభన్‌బాబుతో నిర్మించారు. ఒకటి "బాబు", రెండోది "రాజా."

ఈమధ్య కుమార్‌ను, వారి ఆఫీసులో కలిశాను. మీ తర్వాతి చిత్రం ఎప్పుడు? తారాగణం ఎవరు? అని నేను ప్రశ్నించాను.

"శోభన్‌బాబు ఎప్పుడు డేట్స్ యిస్తే అప్పుడు. తారాగణం ఎవరయినా మా పర్మనెంట్ కథానాయకుడు మాత్రం శోభన్‌బాబుగారే" అన్నారు.

సంవత్సరానికి ఒక చిత్రం మారుతీ ప్రొడక్షన్స్ నిర్మించడానికి నిర్ణయించింది.

మారుతీ కంబైన్స్ అనెడి కొత్త సంస్థను ఎ. గోపాలకృష్ణ స్థాపించారు. ఆ సంస్థ ఒక కొత్త దర్శకుడ్ని పరిచయం చేస్తోంది. ఆ దర్శకుడి పేరు శేఖర్.

### ఆరుద్ర వ్రాసిన జోలపాట

తెలుగుతెర గర్వించదగిన కవి శ్రేష్ఠులలో ఆరుద్ర ఒకరు. ఆయన వ్రాసిన ఎన్నో పాటలు హిట్ అయిన నిజం శ్రోతలకు తెలుసు.

మారుతీ కంబైన్స్ వారి కలర్ చిత్రానికిగాను, ఆరుద్ర ఒక జోలపాట వ్రాశారు.

"నడిరేయి అవుతూవున్నా
నిదురేల రాదు నీకు
విధి నన్ను వంచిస్తున్నా
కథ ముగియదేల నాకు..." ఈ పాటను

సుశీల పాడారు. పాటను విన్న ప్రతివాడికీ నిద్ర తప్పకుండా వస్తుంది. ఆమె అంత కమ్మగా పాడింది. అంత కమ్మగా పాడడానికి, సంగీత దర్శకుడు చక్రవర్తిని అభినందించాలి.

కొత్త దర్శకుడు శేఖర్ నిర్దేశకత్వంలో రూపొందుతున్న "జీవనరాగం" చిత్రంలో పై పాట "అగ్రనటి"పై చిత్రీకరించబడింది. కృష్ణంరాజు కథానాయకుడు.



శ్రీశృంగేరి స్వాములవార్లతో ముఖ్యమంత్రి జలగం వెంగళరావుగారు వారి కుటుంబ సభ్యులు

# సినిమా

### శోభన్‌కు బలే పాత్ర

సమత ఆర్ట్స్ అధినేత చటర్జీగారిని, వారి ఆఫీసులో కలిసినప్పుడు, జనవరి ఒకట్నుంచి ప్రారంభించే కొత్త చిత్రం గూర్చి కొన్ని వివరాలను చెప్పారు.

కథలో మహిళల నాకర్షించే అంశాలు, యువతరాన్ని ఉత్తేజపరిచే అంశాలు వుండడంతో బాటు మాస్ అప్పీలుకూడా వున్న నిజాన్ని యీ విలేఖరి విన్నాడు.

'హీ–మాన్' ధరిస్తున్న పాత్రలో ఎమోషనల్ యాస్పెక్ట్‌తోబాటు రొమాంటిక్ యినిసిడెంట్స్ కూడా వున్నాయి. శోభన్‌బాబు నట జీవితంలో చెప్పుకోదగ్గ పాత్రగా సమత ఆర్ట్స్ వారి పాత్ర వుంది.

ఈ భారీ వర్ణ చిత్రానికి ఆచార్యఆత్రేయ, వెంకటరత్నం, చక్రవర్తి, కృష్ణారావు, అంకిరెడ్డి వంటి సాంకేతిక ప్రముఖులు, విక్టరీ మధుసూదనరావు దర్శకత్వం యస్సెట్ కాగలదు.

### జయద్వయం !

సమత ఆర్ట్స్ వారి భారీ వర్ణ చిత్రంలో శోభన్‌బాబుతోబాటు యిద్దరు "జయ"లు, రాజబాబు, రావుగోపాలరావు, శ్రీధర్ ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు.

జనవరిలో ఇరవైమూడురోజులు, ఫిబ్రవరిలో పది రోజులు, ఏప్రిల్‌లో పది రోజులు జరిగే షెడ్యూల్సులో చిత్రం పూర్తవుతుంది, అన్నారు నిర్మాత ఛటర్జీగారు.

### జగపతి చిత్రం గూర్చి సమత అభిప్రాయం

జగపతి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం గూర్చి, సమత ఆర్ట్స్ అధినేత ఛటర్జీగారు తియ్యటి మాట వెల్లడించారు.

"బంగారు బొమ్మలు" చిత్రం రజతోత్సవం చేసుకునేది తధ్యము.

### క్రాంతి చిత్ర

ప్రముఖ చిత్ర నిర్మాత ఛటర్జీగారి తమ్ముడు ముఖర్జీగారు స్థాపించిన సంస్థ యిది. ఈ సంస్థ ఒక వర్ణ చిత్రాన్ని ఏప్రిల్‌లో ప్రారంభించబోతుంది.

"అర్ధరాత్రి" ఫేమ్ పి. సాంబశివరావుగారిని దర్శకుడుగా, మురళీమోహన్‌ను కథానాయకుడుగా ఎంపిక చేసినట్లు, నిర్మాత ఈవిలేఖరితో చెప్పారు.



'సిరిసిరి మువ్వ'లో ఒక సన్నివేశం



పాంచజన్య ప్రొడక్షన్స్
పెద్దన్నయ్య
స్క్రీన్‌ప్లే
దర్శకత్వం: పి.డి.ప్రసాద్
నిర్మాత: టి. అప్పుదాస్
సహనిర్మాత: ఎస్.ఉమామహేష్ M.Sc., నిర్వహణ: యం.డి.బాందీబాషా
లక్ష్మీ ఫిలింస్
LAKSHMIPUBS

# సినిమా



'పాపానగాళ్ళు'లో ప్రభ, గిరిబాబు

### బంగారు బొమ్మలు

జగపతి ఆర్ట్ పిక్చర్స్ లావిష్‌గా నిర్మిస్తున్న "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రం రెండో షెడ్యూలు డిశంబర్ 15న ప్రారంభమై, షష్ఠం రోజులు జరుగుతుంది.

ప్రేక్షకులు కోరే శృంగారం, వినోదం, భీభత్సం, కరుణరసం "బంగారు బొమ్మలు" చిత్రంలో వున్నాయి.

అక్కినేనిగారిని ఎలా చూడాలి అని ప్రేక్షకులు ఆశిస్తున్నారో, అట్టి అందాల యువరాజుగా నాగేశ్వరరావుగారు అగుపిస్తారు. "గ్లామర్ క్వీన్" మంజుల తన ముగ్ధమోహన రూపంతో ప్రేక్షకులను ఆకర్షిస్తుంది.

ఈ చిత్రంలో "బుల్ ఫైట్" స్పెషల్ యస్పెట్‌గా వుంటుంది. ఆత్రేయగారి సంభాషణం, మహదేవన్‌గారి సంగీతం, వెంకటరత్నంగారి ఛాయాగ్రహణం, కృష్ణారావుగారి శిల్పం పోటీపడి పని చేస్తాయి. దర్శకుడుగా రాజేంద్రప్రసాద్‌గారు "బ్రిలియంట్"గా వుంటారు.

### సుగుణ పిక్చర్స్ !

హైదరాబాదులో వెలసిన మరొక అక్కినేని సంస్థ సుగుణ పిక్చర్స్. ఈ కొత్త కంపెనీని, బావట్ల వాస్తవ్యులు ఎస్. శేషగిరిరావు స్థాపించారు, డిశంబర్ పదకొండున.

డిశంబర్ 17న, సుగుణ పిక్చర్స్‌వారి మొదటి పాట రికార్డింగ్, మదరాసు ప్రసాద్ థియేటర్లో ఆనందోత్సాహంతో జరిగింది. "మహదేవన్... ఆత్రేయ... బాలసుబ్రమణ్యం", ఆనాటి కార్యక్రమంలో ముఖ్య పాత్రధారులు.

"నట సామ్రాట్" కొత్త తరహా పాత్రను పోషిస్తున్న సుగుణ పిక్చర్స్‌వారి వర్ణచిత్రం ఫిబ్రవరి రెండున అన్నపూర్ణా స్టూడియోస్‌లో ప్రారంభమవుతుంది.

ఈ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు. మాట... పాటలను ఆచార్య ఆత్రేయ, సంగీతాన్ని మహదేవన్, ఛాయాగ్రహణాన్ని సెల్వరాజ్ నిర్వహిస్తున్నారు.

"అన్నపూర్ణ"లో సుగుణ పిక్చర్స్‌వారి చిత్రం ఏడవదవుతుంది.

### అక్కినేని... ముప్పలనేని చిత్రం

"బలిపీఠం" చిత్ర నిర్మాతల్లో ఒకరయిన ముప్పలనేని శేషగిరిరావుగారు, నవరస నాయకుడు నాగేశ్వరరావుగారిని తన తదుపరి చిత్ర నాయకుడుగా ఎంపిక చేసి ఏడాది దాటింది.

ముప్పలనేని ఒక వంగ చిత్రాన్ని కొనడం, ఆ చిత్రం అక్కినేనిగారికి బాగా నచ్చడం పాఠకులకు తెలిసిన విషయం.

ఆ చిత్రం షూటింగు ఎప్పుడా అని అక్కినేని అభిమాన సంఘ సభ్యులు ప్రశ్నిస్తూ వస్తున్నారు.

ఫిబ్రవరి రెండు నుంచి పదమూడు వరకు మొదటి షెడ్యూలు, మార్చి ఒకట్నుంచి పదునైదు వరకు రెండవ షెడ్యూలు, ఏప్రిల్ ఒకట్నుంచి షష్ఠం రోజులు మూడవ షెడ్యూలు జరుగుతుంది. ఈ వర్ణ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు.

### డిశంబర్ 17న రికార్డింగ్

"ముప్పలనేని... అక్కినేని"గార్ల వర్ణచిత్రం తాలూకు తొలి పాట రికార్డింగు డిశంబర్ 17న ప్రసాద్‌లో జరిగింది. ఆచార్య ఆత్రేయ వ్రాసిన వలపు పాటను, బాలు పాడారు.

ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, ఆచార్య ఆత్రేయ రచనను, సెల్వరాజ్ ఛాయాగ్రహణాన్ని, జి. వి. సుబ్బారావు శిల్పాన్ని, శ్రీనివాసరావు సహదర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు.

అక్కినేని కొత్త తరహా పాత్రను పోషిస్తున్న, అన్నపూర్ణా స్టుడియోస్‌లో నిర్మితమయ్యే యీ భారీ వర్ణ చిత్రంలో "ఊర్వశి, కళావాచస్పతి" ముఖ్య పాత్రధారులు.

సహ తారాగణంలో సమర్థులే వుండగలరని, నిర్మాత ముప్పలనేని చెప్పారు.

అన్నపూర్ణ స్టుడియోస్‌లో ఆరంభమయ్యే ఏడవ చిత్రం ముప్పలనేనిగారిది.

### తెలుగు చిత్రంలో శివాజీ

తెలుగు దేశంలో మన అగ్రశ్రేణి హీరోలకున్న పలుకుబడి ... ప్రజాదరణ తమిళ హీరో శివాజీకి వుందని వ్రాసే ధైర్యం ఈ కలానికి వుంది.

మారుతీ కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "జీవనరాగం" చిత్రంలో తమిళ "నట సామ్రాట్" ఒక ముఖ్య పాత్రను పోషించడం ముదావహం. పాత్ర స్వభావం, దానికి దర్శకుడు శేఖర్ యిచ్చిన రూపకల్పనా విధానం శివాజీకి నచ్చింది గాబట్టే, తెలుగు చిత్రాన్ని అంగీకరించారు.

"భక్త తుకారాం" తర్వాత, శివాజీ నటిస్తున్న తెలుగు చిత్రం యిది.

ఈ చిత్రంలో కృష్ణంరాజు, జగ్గయ్య, రావు గోపాలరావు, వాణిశ్రీ, జయసుధ, నిర్మల నటిస్తున్నారు.

కొత్త దర్శకుడు శేఖర్ పనిచేసిన పదిరోజుల షెడ్యూలు సంతృప్తికరంగా వున్నట్లు నిర్మాత గోపాలకృష్ణ చెప్పారు.



'సీతారామ వనవాసం'లో బి. సరోజాదేవి



'ఈతరం మనిషి'లో జయప్రద, శోభన్‌బాబు



### కేరళ దేశంలో తెలుగు జంట

ఆంధ్రుల అగ్రద్వయం అంటే అక్కినేని... వాణిశ్రీ డిశంబర్ మొదటి పది రోజులు కేరళ దేశంలో విహరించారు.

ప్రకృతి రమణీయతతో విరాజిల్లే అందమైన "లవ్ స్పాట్స్"ను, తమ అధీనంలో వుంచుకుని, ఆటపాటలతో వుషారు గావించారు.

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌తో నిర్మిస్తున్న "ఆలుమగలు" చిత్రానికిగాను, నాగేశ్వరరావు... వాణిశ్రీగార్లు తిరువేంద్రం వెళ్లారు.

అక్కడున్న పాన్ముడి, అరవికరడామ్, కోవలం మున్నగు ప్రదేశాలలో అక్కినేని... వాణిశ్రీ ప్రేమాయణం సాగించారు.

కేరళ దేశానికి, యీ విలేఖరి కూడా వెళ్లాడు. ఈ కలం కన్నది నిజమని పాఠకులు నమ్మాలి.

అక్కినేనిగారిని చూడడానికి వచ్చిన జనం వేల సంఖ్యలో వున్నారు. ముఖ్యంగా అమ్మాయిలు అక్కినేనిగారిని చుట్టుముట్టి, ఆయన అందాన్ని అభినందించారు.

షూటింగు చూడడానికి వచ్చిన వేలమంది అభిమానులకు, నిర్మాత ఎ. వి. సుబ్బారావుగారు తేనీరిచ్చి, చిరునవ్వుతో సత్కరించారు.

"ఆలుమగలు" వర్ణ చిత్రం షూటింగు జనవరి పదవ తేదీతో పూర్తవుతుంది, అన్నారు దర్శకుడు తాతినేని రామారావు.

ఈ కుటుంబగాథా చిత్రంలో నాగభూషణం, గుమ్మడి, రాజబాబు, నారాయణరావు, లక్ష్మీకాంత్, కాకరాల, రోజారమణి, రాజకుమారి, జయమాలిని ప్రధాన పాత్రధారులు.

### కొత్త ఒప్పందం

కేరళ దేశంలో "ఆలుమగలు" చిత్రం షూటింగు జరిగిన రోజుల్లో విజయ ... మాధవీ అధినేతల్లో ఒకరయిన వడ్డె రమేష్‌గారు అక్కినేని గారిని అప్రోచ్ అయ్యారు. తనకొక చిత్రం చేసి పెట్టామని అగ్రనటుడ్ని అడిగారు.

నాగేశ్వరరావుగారు సరే అన్నారు.

విజయ ... మాధవీ పిక్చర్స్‌వారి ఆఫీసులో రోజా కథపై చర్చ జరుగుతూ వుంది. దర్శకుడు టి. కృష్ణ, ఆచార్య ఆత్రేయ, తమిళ రచయిత బాలమురుగన్, కొత్త రచయిత జంధ్యాల; నిర్మాత రమేష్, ఎడిటర్ జి.జి. కృష్ణారావు, నిర్మాత డి.బి.ఎన్. గార్లు అక్కినేనిగారితో వెరైటీ కథను ఆలోచిస్తున్నారు.

తెలుగు చలనచిత్ర రంగంలో వర్ధిల్లే భారీ చిత్ర సంస్థల్లో విజయ...మాధవీ పిక్చర్స్ ఒకటి.

### శ్రీరామ చిత్ర

"ముత్యాలముగ్గు" వర్ణ చిత్రాన్ని సమర్పించిన సుకుమార్‌గారు తన తరువాతి చిత్రాన్ని భారీగా నిర్మించే నిర్ణయాన్ని తీసుకున్నారు.

"నటసామ్రాట్" ద్విపాత్రాభినయం ఈ చిత్రంలో ప్రత్యేక ఆకర్షణగా వుండగలదు.

'వీడని బంధాలు'లో ప్రేమ





'అంబాడోళ్ల రాందాసు'లో రోజా, చలం

# సినిమా

**శ్రీ ఉమాదేవి ఫిలిమ్స్ !**

ఎడిటర్‌గా ఒక ప్రముఖ స్థానాన్ని నిర్వహిస్తూ, దర్శకుడుగా కూడా పర్వాలేదనిపించుకున్న కె. సత్యంగారిని ఈ సంస్థ దర్శకుడుగా ఎంపిక చేసింది. ఈ సంస్థను డాక్టర్ పి. వి. చంద్రశేఖర్ స్థాపించారు.

ఈ చిత్రానికి మహదేవన్ సంగీత సారధిగా, బొల్లిముంత రచనా సారధిగా, లక్ష్మణగోరే ఛాయా గ్రహణ సారధిగా వ్యవహరిస్తున్నారు.

రవిశంకర్ పిక్చర్స్‌లో నిర్మాణశాఖలో సిన్సియర్ అనిపించుకుంటున్న తాతాజీ ఈ సంస్థకు వున్న ముఖ్యుల్లో ఒకరని తెలుస్తోంది.

**సి. పి. ఆర్. లో శ్రీధర్ ద్వయం**

అలనాడు సీత లక్ష్మణుడు గీసిన గీతను దాటింది ఫలితంగా అనూహ్యమైన బాధల నెదుర్కొంది ప్రతి స్త్రీ జీవితానికి కొన్ని హద్దులుంటాయి మరి చేయకూడని నిబంధన లుంటాయి అలాంటి హద్దులను, నిబంధనలను పొరబాటున కూడా మరువరాదు, దాటి నడువరాదు మరచినా లేక దారితప్పి నడచినా సానుభూతి కరువౌతుంది, సాటివారిలో గౌరవం స్వల్పమౌతుంది ఈ అంశాలను పాత్రల రూపంలో సమీక్షిస్తూ, తయారవుతున్న చిత్రమే సి పి ఆర్ ప్రొడక్షన్స్‌వారి "సీత గీత దాటితే ?" ఈ చిత్రానికి శ్రీధర్ డబుల్ పని చేయడం ఒక విశేషం ఒక శ్రీధర్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ శాఖలకు హీరో కాగా మరొక శ్రీధర్ చిత్ర కథానాయకు డయ్యాడు

సి వి శ్రీధర్ దర్శకత్వంలో సి పి ఆర్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "సీత గీత దాటితే ?" చిత్రంలో శ్రీధర్ పాత్ర బహు చక్కగా మలచబడింది. ప్రొఫెసర్‌గా శ్రీధర్ నటన సహజంగా వుందని, సాఫ్ట్ కారెక్టర్స్ చేయడంలో శ్రీధర్‌కొక ప్రత్యేక బాణీ వుందని చిత్రం చూచినవారభిప్రాయపడుతున్నారు అధిక సంఖ్యాకుల పై అభిప్రాయంతో ఈకలం కూడా ఏకీభవిస్తోంది, ఎందుకంటారేమో ? "ముత్యాలముగ్గు", "అమెరికా అమ్మాయి" చిత్రాలలోని శ్రీధర్ పాత్ర పోషణ చూచాక సాఫ్ట్‌రోల్స్ చేయడంలో శ్రీధర్ దిట్ట అనే దృఢాభిప్రాయం ఏర్పడింది

శ్రీధర్‌కు జంటగా కవిత, చక్రపాణికి జోడుగా భవానీ నటిస్తున్న "సీత గీత దాటితే" చిత్రంలో నిర్మల, విజయరాణి, వై విజయ ముఖ్యపాత్రధారులు గణేష్‌పాత్రో (మాటలు), మహదేవన్ (సంగీతం), ఆత్రేయ (పాటలు), బాలకృష్ణన్ (కెమెరా), జి. వి సుబ్బారావు (కళ), సాంకేతిక సారధులు సి.పి. రెడ్డి నిర్మిస్తున్న ఈ చిత్రం జనవరి 26 వ తేదీ విడుదలౌతుందని సి పి.ఆర్. సహాయదారుడైన ఏ. పూర్ణచంద్రరావు చెప్పారు.

'చక్రధారి' లో ...



**కృష్ణకు జై !**

1976లో కృష్ణ నటించిన చిత్రాలు (దాదాపు అన్నీ) నిర్మాతలకు లాభాలను ఆర్జించి పెట్టాయి.

"కొల్లేటి కాపురం, భలేదొంగలు, దేవుడే గెలిచాడు" చిత్రాలు ప్రజామోదాన్ని పొందాయి. "కృష్ణకు జై" అన్నారు ప్రేక్షకులు.

"విజయా... సురేష్ నిర్మిస్తున్న సావాసగాళ్ళు, అమృత ఫిలింస్ నిర్మిస్తున్న ఈనాటి బంధము ఏనాటిదో, వెంకటరమణా పిక్చర్స్ నిర్మిస్తున్న జన్మ జన్మల బంధం" చిత్రాలు శత దినోత్సవం చేసుకునే అర్హతను పొందివున్నాయి.

1977లో కృష్ణ కూడా "సూపర్ స్టార్" కాగలరని యీ కలం ఆశిస్తుంది.



**తెలుగువాళ్ల తమిళ చిత్రాలు**

తెలుగు నిర్మాతలకు తమిళ చిత్రాలపై మోజు ఏర్పడింది. తత్ఫలితంగా తమిళ చిత్ర నిర్మాతలు "రేటు" పెంచి ఎక్కువ డబ్బును ఆశిస్తున్నారు.

మనవాళ్లలో అయికమత్యం వుంటే, వాళ్ళు "ధర" పెంచే అవకాశం వుండదు.

ఒక చిత్రాన్ని కొనడానికి, మనలో ఒకరు వెళ్లారు అని తెలిసికూడా, అదే చిత్రాన్ని కొనడానికి మనవాళ్లే పోటీ పడడంవల్లే, తమిళ నిర్మాతలు రోజుకొక విధంగా "వేల్యూ" పెంచుతున్నారు.

ఈమధ్య విడుదలయిన తమిళ చిత్రాలు కొన్ని, మనకు కూడా నచ్చేవిగా వున్నాయన్న నిజాన్ని యీ విలేఖరి అంగీకరిస్తూ, ఒక సలహా యివ్వడానికి సంశయించడంలేదు.

ఒకే చిత్రానికి మనలో మనకు పోటీ దేనికి ?

— శ్రీనివాస్

సీరియల్

# మగరికము

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

సరోజిని యస్. యస్. యల్. సి. ప్యాసయిన రోజులలో, చింపమ్మ శేషయ్యతో ఇలా అన్నది -

''అన్నయ్యా! ఏదో లోకజ్ఞానం కోసం ముద్దుగా కూతుంకి చదువు చెప్పించావు బాగానే ఉంది కాని పై చదువెందుకు? ఉద్యోగం చేయనా? ఊళ్లేలనా? నీకూ 'నా' అన్నవాళ్లెవరూ లేరు. నాకూ నువ్వు తప్ప ఎవరూ లేరు నీకూ ఒక్కర్తే కూతురు నాకూ ఒక్కడే కొడుకు గుణదలలో ట్రంకు రోడ్డుమీద. అది మెరకయినా, నాకూ ఒక కుంట పొలం ఉంది. నీకూ ప్రక్క ఊళ్లో రెండెకరాం మాగా ణీఉంది. ఇద్దరి పొలాలు కలిపి లెక్కవేస్తే రెండెకరాలన్నర ఆస్థి. నీ పేగును నా మెడకు వేయి. నీ కూతురిని ఎంతో ముద్దుగా, నా కోడలుగా చూసుకుంటాను. నువ్వా ఎఱిగిన చోటు. మేము చేలోకువవాళ్లం. నీవు ఒకటి అన్నా, నేను పడగలదాన్ని. నీ కూతురూ, నీ అల్లుడూ నీ ముప్పూ, నా ముప్పూ, గడుపుతారు''

శేషయ్యకు కోపంతోపాటు నవ్వుకూడా వచ్చింది.

''ఓసి, చింపీ! అమ్మకు నీకంటె, నేనే ముందు పుట్టానే! నా చెవులు కమసాలే కుట్టాడు కాని, కమ్మరి కుట్టలేదు. నాకూ తెలివి ఉంది. నువ్వే తెలివిగలదానవనుకోకు! మాకూ జమీందారు గారికీ కలిసి వంద అరకల వ్యవసాయం అన్నాడట — వెనకంటికి ఒకడు! నీవెన్ని అరకలురా, అని అడిగితే, ఒక కుంటి ఎద్దు — అన్నాడట! చిన్నప్పుడు పిల్లలు ఆటలాడుకుంటూ అనుకుంటూ ఉండే వాళ్లు— నేను ఊక తెస్తాను. నువ్వు శనగపప్పు తీసుకునిరా! ఇంచక్కా మనం దానిని కలుపుకుని ఊదుకుని చెరిసగం తిందామని! అల్లా ఉన్నది నువు చెప్పేది! నీ పొలమేమో అర్ధ ఎకరమా! వట్టి మెట్టా! శూర్పణఖమాన్యమా! అల్లాంటిదాన్ని నా రెండెకరాలతో కలిపితే నీ కొడుక్కీ నా కూతురికీ సుఖజీవనం జరుగుతుందా! చింపీ! ఏమి తెలివి తేటలవే యివి? నా యెదుట నీ జీవితంలో ఎప్పుడూ ఇల్లాంటి బోడి ప్రసంగం చేయకు. ఆస్థి చదువులేని ఆ బడుద్ధాయి 'సూర్యం'గాడికి నా పిల్లను నేను బ్రతికి ఉండగా ఇవ్వను. ఆడ వాళ్లకు పెద్ద చదువెందుకు? అని నీవు నాకు ఉపదేశం చేయనక్కరలేదు. ఏమో! అవసరం వస్తుందేమో ఆడది కూడా ఉద్యోగం చేయడానికి?'' అన్న శేషయ్య మాటలకు వచ్చిన దుఃఖాన్ని చింపమ్మ ఆపుకుంది.

''అన్నయ్యా! నీతో వియ్యం పొందుదా మను కున్నాను. ఆ ఆశ నిరాశగా చేశావు. నీ పిల్లసంగతి నీ యిష్టం. నాయిష్టం ఏముందీ బోడియిష్టం! తల్లిలేనిపిల్ల పరాయి యింటికి వెడితే కష్టపడు తుందేమోనని, నాకడుపులోనే పెట్టుకోవాలను కున్నాను.కాదన్నావు. తీరిపోయింది. ఇక నోరెత్తితే ఒట్టు.''

''కోపం వచ్చిందిటే, చింపీ!''

''వచ్చినిస్నేంచేస్తాను? పేదవాడికోపం పెదవుల చేటు! మనం కుడీ ఎడమా లేనివాళ్లం కదా, అను కుని ఇద్దఱి ఆస్తినీ కలిపి మాట్లాడాను — మాట వరుసకు! నువ్వు తగిన సమాధానం చెప్పావు. పేద వాళ్లకు క్రొత్త ఆస్థిరమ్మంటే ఎల్లా వస్తుంది? నువ్వు నన్ను ఇచ్చింది ఈ ఎస్టేటు యజమానికేగా! నన్నివ్వడానికి పనికి వచ్చిన ఆస్థి, నీ కూతురును ఇవ్వవలసి వచ్చేటప్పటికి నీ కంటికి దిశాయించలేదు. నీ పిల్లను బడుద్ధాయికి ఇవ్వక్కఱలేదు. బడా వాడికే ఇచ్చుకో.''

ఊహ తెలిసిన సరోజిని ఇద్దఱి ప్రసంగాలూ విన్నా, ఎవ్వరిది న్యాయమో తేల్చుకోలేక పోయింది. ఆమె త్రాసులో అవి సమంగా తూగినై. శేషయ్య సరోజిని కోసం చాలా పెళ్లి సంబంధాలు వెతికాడు.

''ఎంత కట్నం ఇస్తారో ముందే తేల్చండి. దానినిబట్టి పిల్లను చూడడానికి రావడమో రాక పోవడమో నిర్ణయించుకుంటాము.'' అనే వారు చాలా మంది. వాళ్లు మర్యాదలేని వారని అనుకునే వాడు. అల్లా ఎందుకు వాళ్లు అంటున్నారో అతనికి తెలిసేది కాదు.

''పదివేలు కట్నం ఇస్తేకాని చేసుకోకూడదని మా మనస్సులో ఉన్నదను కోండి! పని అంతా పాడు చేసుకుని పిల్లను చూసి వేస్తే, వాళ్లు వెయ్యినూట ఎదహార్లు అన్నారనుకోండి! మేము ఉసూరుమంటూ లేచి రావలసి వస్తుంది. అంత్యనిష్ఠురం కంటె ఆది నిష్ఠురం మేలు. మేము తర్వాతయినా చేసుకోమని చెప్పేదేగా!'' అనేవాళ్లు.

శేషయ్యకు పిలవాలని అనుకున్నవికొద్ది. పిలచిన వారిలో ఇంటికి వచ్చి చూసుకున్న వారు అల్పం. కొందఱు రైలుచార్జీలు కూడా అడిగేవారు. ఆ కొద్దిమందిలో పిల్ల నచ్చనివాళ్లే ఎక్కువ మంది. అవయవ సౌష్ఠవం, కనుముక్కు తీరూ, కలదే అయినా, సరోజిని తోలు పచ్చనిదికాదు, అల్లా అని తారునలుపూ, బొగ్గునలుపూ కూడా కాదు. చామనచాయ కలది. ఈ 'సంసార పక్షం' పిల్లను చూసి ఏమయినా సరే ఈ పిల్లనే చేసు కుంటాను లేకపోతే బ్రహ్మచారిగా ఆజన్మం ఉండి పోతాననే వరులెవరూ ఉండరు.

విసిరి కట్నం ఇస్తానని శేషయ్య అంటే ఎల్లా ఉండేదో! ఆ విసరడం లేకపోవడంవల్ల, పెళ్లి ప్రయత్నం కాలక్షేపపు వ్యవహారమయిపోయింది. క్రియ కట్టలేదు. పిల్లను చూసిన తర్వాత కొందఱు నచ్చిందో నచ్చలేదో చెప్పకుండా. కట్నం సంగతి తేల్చమని అడిగి, శేషయ్యకు అందని అంకెను బయట పెట్టేవారు. శేషయ్య గ్రుడ్లు మిటకరించి కోపం వచ్చి ''వీళ్లు కోరుకున్న డబ్బిస్తే పిల్ల నచ్చుతుం దన్నమాట! అల్లాంటి దానికి పెళ్లిచూపులెందుకు? మాకు ఇంత డబ్బుపోస్తే కుంటిదయినా, గ్రుడ్డి దయినా, చేసుకుంటామని చెప్పవచ్చునే! వాళ్ల ధనా కాంక్షను బయట పెట్టకుండా, వీరి అశక్తతను బయట పెట్టించాలనీ, పిల్ల నచ్చలేదనే సాకు చెప్పా లనీ వారి ఉద్దేశం'' అని కసకసలాడేవాడు.

ఇతని సంగతి తెలిసి, అది విన్నవాళ్లు ''ఏం, నాయనా! తీపు వచ్చిందా? వాళ్లు నిన్ను కట్నం ఎందుకు ఎక్కువ అడుగకూడదు? నువ్వు వాళ్ల ఆస్థిచూసి, మా అమ్మాయి పెద్ద పెద్ద భవంతు లలో ఉండాలనే దురాశతో ఎగబడి వాళ్ల దగ్గరకు వెడితే, వాళ్లు తోచిన మాట చెప్పారు. నీదీ వ్యాపారమే, వాళ్లదీ వ్యాపారమే! నువ్వేమో చేసు కోవడానికి సిద్ధంగా ఉన్న మేనల్లుణ్ణి వదలివేసి, నీ పిల్లకు సుఖం ఎక్కువకావాలని ఎక్కువ కట్నం ఇస్తా నంటున్నావు. వాళ్లేమో డబ్బు ఇవ్వలేనికాడికి ఈ నల్లపిల్ల మాకెందుకు? రంభనే వెతుక్కుంటాం అంటున్నారు'' అని ఎప్పుడయినా శేషయ్యతో అంటే మాట్లాడక ''అవును అంతా వ్యాపారం!'' అని నిట్టూర్చేవాడు.

సంబంధాల వారిని కోపంతో కొంతకాలం ఇంటికి రమ్మని పిలవడమే మానివేశాడు. దానివల్ల వారికి వచ్చిన నష్టం లేదని గ్రహించాడు. కట్నం ఇవ్వడమూ, పుచ్చుకోవడమూ దురాచారమే అయినా అల్లా ఇవ్వనిది పెళ్లి కావడం కష్టంగా ఉన్నది కనుకా, నిషేధిస్తూ అప్పటికి శాసనం రాలేదు కాబట్టీ, బాహాటంగా తన పిల్లకు ఇంతకట్నం ఇస్తానని వెల్లడిచేశాడు.

ఆ అంకెకు ఆశపడి చాలా మంది వచ్చేవారు. పిల్ల నచ్చకపోయినా నచ్చినదనే చెప్పేవారు. శేషయ్య ''నేను ఆ కట్నం ఇవ్వడానికయితే నాకభ్యంతరంలేదు. ఆ కట్నం పుచ్చుకునే అర్హత మీవద్ద ఉన్నదని ఋజువు చేసుకున్నప్పుడే ఆ కట్నం ఇవ్వడం జరుగు తుంది. ఆ పరిశీలన చేసేది నేను.

మా అబ్బాయి మగవాడు అంటే కేవలంచాలదు అందుకు కూడా కొంత కట్నం ఉంటుందనుకోండి. అది మీరుకోరినట్లు కాదు. మాకు తోచినట్లు, నేను ప్రకటించినదీ, మీరు కోరినదీ, మీకు కావాలంటే, మీ అర్హతలు మీరు నిరూపించుకోగలిగి ఉండాలి. ఒకటి — ప్రామిసరీ నోట్లమీద మీకు వచ్చే సంవత్స

కొత్త సీరియల్ ప్రారంభం!

రాదాయమెంత ? రెండు — బాంకులో మీకు నిలువ ఉన్న సొమ్ము ఎంత ? మూడు — తణఖా దస్తావేజుల మింజామలె మీకు రావలసిన సొమ్ము ఎంత? నాలుగు— అసలు మీ ఆస్తి ఎంత ? అందులో వరుడి వాటా ఎంత ? ఆడపిల్లల పెళ్లిళ్ళ ఖర్చు తీసివేస్తే వరుడికి ఎంత ఆస్తి మిగులుతుంది ? వరుడికి చదువు పెళ్లి అయిన వెంటనే మాన్పిస్తారా? లేక కొనసాగిస్తారా? ఎంతవరకు ? ఉండడానికి మీకు కొంప ఉన్నదా ? అది గట్టి కొంపేనా ? అందులో ఈ పిల్లవాడి వాటా ఎంత ? ఇవన్నీ మీరు చెప్పినతర్వాత, వేటి కెన్ని మార్కులు వేయాలో వేసి, మీకు ఎంత కట్నం తీసుకునే అర్హత ఉన్నదో నేను నిర్ణయిస్తాను. నేను ప్రకటించిన కట్నం తీసుకునే తాహతు గల వాళ్ళంటే ఇచ్చేస్తాను.'' అనేవాడు.

''అప్పులు చేసి మగపిల్లలకు చదువులు చెప్పించి, ఈ కట్నం సొమ్ముతో అప్పులు తీర్చుకోవాలని అనుకున్నవాళ్ళూ, ఒక్క ఏడాది పిల్లవాడికి జబ్బుచేసి ఉద్యోగానికి వెళ్లలేకపోతే పాయిలో పిల్లి లేవని వాళ్ళూ, అడ్వాన్సు డబ్బు ఇస్తేనేకాని, పెళ్లి సామానులు కొనుక్కోలేనివాళ్ళూ, ఘనంగా కట్నం ఇమ్మని అడగడానికి సిగ్గుపడవద్దూ?'' అని ముఖంమీదే అనేసేవాడు.

పై విధంగా శేషయ్య మాట్లాడుతూ ఉంటే కొందరు హడలిపోయేవాళ్ళు. కొంద రాయనకు పిచ్చెక్కినదని ప్రచారం చేశారు. కొందరు కార్యం పొత్తు చేసుకోవడం చేతకానివాడనీ, 'క్రఅపడి' మనిషి అనీ, ఈ జన్మలో కూతురు పెళ్లి చెయ్యలేడనీ, ఆ పిల్ల అంత ఆ పిల్ల తెగించి చేసుకోవలసిందేనని అనేశారు. శేషయ్య తిండికీ, సరోజిని బి. ఎ., బి. యిడి. కావడానికీ రెండెకరాల పొలం అమ్మివేశాడు. అయినా పెళ్లి ప్రయత్నం మానలేదు.

పెద్ద చదువు చదివింది కనుక, పిల్లను అసలు కట్నం లేకుండానే చేసుకునేవాళ్లు ఉండవచ్చునని ఆశ పడ్డాడు. అతడు ఉద్యోగస్థుడే అవుతాడని కలలు కన్నాడు. సామాన్యులు పెళ్లి చేసుకోవడానికి సరోజిని డిగ్రీ, డేంజర్ సిగ్నల్ అయికూర్చుంది. చదువుకున్న పిల్లను చేసుకుందా మనుకున్నవాళ్లకు, కట్నం లేకుండా చేసుకోవడం హోదాకు లోపమనిపించింది. కాగా అసలు కట్నమయితే, ఇంత పెట్టుబడి పెట్టిన చదువు, కొసరయిపోయింది. కాలు పొడగిరి సరోజిని, వయస్సు కారణంగా, ఎదిగి కూర్చుంది.

''అంత చదువుకున్న పిల్ల మావాడికెందుకు ? మావాడు వట్టి 'మేధకుడు'. వాడిని బుట్టలో పెట్టి వేసేటట్టుగా ఉంది పిల్లవంక చూస్తూ ఉంటే'' అన్నది ఒక మహిళ. ''ఏమి పిల్లమ్మా ! ఎద్దల్లే ఎదిగి పోయింది. పిల్లల తల్లికి మల్లే ఉందీ కాని కన్నెపిల్లల్లే లేదు.'' అని అంది పెళ్లి చూపులకు వచ్చిన మరొక మహిళ.

పొలం అమ్మిన డబ్బుతో పిల్లకు చదువు చెప్పించకుండా, ఏ అయ్యకో ఒక అయ్యకు ఇచ్చి ముడిపెట్టి వేస్తే, తానీపాటికి మనుమలిని ఎత్తేవాడిననీ, కూతురికీ ఆశ్రయం దొరకి ఉండేదనీ వాపోయాడు శేషయ్య. ఆడది సంపాదిస్తే తినడం ఇష్టం లేకపోయినా, ఇంట్లో కుండలు డింకీలు కొడుతున్నవి కమక, సరోజినిచేత ఒక అర్జీ వ్రాయించి, హైస్కూలు అధికారుల కాళ్లు పుచ్చుకుని, ఎల్లాగయితే ఏం విజయవాడలోనే ఒక టీచరు ఉద్యోగం వేయించాడు. ఆడపిల్లల స్కూలులో ఖాళీలు లేవు కమక, మిశ్రమ పాఠశాలలో ఉద్యోగం వచ్చినా, దానికే తల ఒగ్గాడు. విధిలేక సరోజిని ఉద్యోగంలో ప్రవేశించింది. అయితే ఆ హైస్కూలులో తనతోపాటు, ఇంకా ఉద్యోగం చేసే ఆడవాళ్ళూ, ఆడ టీచర్లకు ఒక ప్రత్యేకమయిన విశ్రాంతి గదీ ఉన్నందుకు తృప్తిపడింది.

శేషయ్య, స్కూలుకు దగ్గరలో ఒక డాబా ఇంట్లో ఒకవాటా యాభై రూపాయలకు అద్దెకు తీసుకున్నాడు రిక్షాఖర్చు కలిపి వస్తుందని. అతనికి అన్నలు కానీ, తమ్ముళ్లుకానీ, భార్యకానీ లేరు. ఉన్నదల్లా తోబుట్టువు చింపమ్మ. అడపిల్లలు పుట్టి పోతూ ఉంటే, ఏదో 'చింపి' మోస్తరుగా బ్రతికితే చాలునని తల్లిదండ్రులు ఆపేరు పెట్టారు. పెద్దయిన తర్వాత చింపి, చింపమ్మ, అయింది. పెంటయ్య ఆబద్దాలు, టీకాలు—ఇల్లాంటి పేర్లు మగపిల్లలకు ఆల్లాంటి సందర్భాలలో పెట్టినవే. చింపమ్మకు ఒక్కడే కొడుకు. భర్త గతించాడు. కొన్ని ఆది



వారాలు నియమంగా ఉండడం చేత సూర్యంకడుపు నిండేవాడు. అందుచేత సూర్యభాగవానుడనే పేరు పెట్టుకుంది—అతని తేజస్సు చూసి. పేదల పేర్లు ఎంత గంభీరంగా ఉన్నా, తీరా పిలువ వలసి వచ్చేటప్పటికి కొంత హ్రస్వమవుతవి. అందుచేత అతని పేరు అందరికీ, చివరికి తల్లికి కూడా 'సూర్యం' అయి ఊరుకుంది.

చింపమ్మకు గుణదలలో కుంట పొలమేకాక, నివేశన స్థలమూ, రాతిగోడల పాకా ఉన్నవి. అందులో గుట్టుగా కాలక్షేపం చేస్తూ సూర్యాన్ని ధర్మ్డఫారమ్ వరకూ చదివించింది. ఆపైన చదివించడం, తలకు మించిన బరువనీ, దానితో ఉన్న కుంటమెరకా ఊడుతుందని భయపడింది. ఒకవేళ చదివించినా ఆ సొమ్ముతో యస్. యస్. యల్. సి. పూర్తి అవుతుంది. ఆ చదువుతో సంపాదించగల పెద్ద ఉద్యోగం లేదు. అందుచేత స్థిరమైన, కొంత జీవనాధారమయిన, అర ఎకరాన్నీ అమ్మకుండా నిలుపుకోడానికే నిశ్చయించుకుంది. పిల్లనిచ్చేవాళ్లకు ఆ పొలమయినా ఉన్నదని చెప్పుకోవచ్చునని ఆమె అభిప్రాయం కూడా. చాటుగా మాటుగా కొన్నిచోట్ల వంటలు చేసి డబ్బు సంపాదించి, సూర్యానికి ఒక డొక్కు సైకిలు కొనిపెట్టి అంతటితో ఆ పని చేయడం మానుకుంది. తల్లి తనకు సైకిలు ఎల్లా కొనిపెట్టగలిగిందో సూర్యానికి కూడా తెలియదు.



## 2

ఆ సైకిలు మీదనే గుణదల నుండి విజయవాడ ప్రయాణం చేస్తూ ఒక వైదిక బ్రాహ్మణుడి దగ్గర, నమకం, చమకం, వగైరాలూ, వివాహ ఉపనయనాలు చేయించే విధానం, నేర్చుకున్నాడు. ఆబ్దిక మంత్రం చెప్పకున్నాడు. ఇంకా చిల్లర మల్లరలు చెప్పకున్నాడు. సత్యనారాయణ వ్రత కథ ఒడుపుగా చెప్పడం అలవాటు చేసుకున్నాడు. దేనికెంత టయిము పడుతుందో, అంత సమయంలోనే, నిక్కచ్చిగా ముగించడం నేర్చుకున్నాడు. చెప్పకున్నంత వరకూ, గట్టిగా చెప్పకున్నాడు.

గురువుగారితో కలిసి వెడుతూ ఉంటే, వివాహాది శుభ కార్యాలలో ఇతణ్ణి కూడా సంభావించేవారు. గురువుగారికి అభిషేకాలు మితిమించి చేయవలసిన పని కలిగినప్పుడవి సూర్యానికి వప్పగించేవారు. దానివల్ల అతడు కొంత డబ్బు సంపాదించేవాడు. విజయవాడలో చాలాచోట్ల దేవీ నవరాత్రాలు చేసేవారు. ఆ పూజలూ, కనకదుర్గ దేవాలయంలో పూజలూ, వీటివల్ల కొంత ద్రవ్యం వచ్చేది. శివరాత్రినాడు అభిషేకాలు బాగానే వచ్చేవి.

చిన్నతనం గుణదలలో గడవడంచేత, అక్కడ గౌరవభావం ఇతనియందు తక్కువ. విజయవాడలో పేరు పెరిగిన తర్వాత గుణదలలోకూడా అతనిమీద గౌరవం పెరిగి, శుభకార్యాలకు పిలవడం ప్రారంభించారు. విజయవాడలో వివాహాలు ఇతడు చేయిస్తున్నాడనేది అతనికి పెద్ద గౌరవం తెచ్చిపెట్టి, పొరుగూళ్లకు కూడా పిలవడం ప్రారంభించారు.

గుణదల ఊరు పరిమితమైనది అయినా, విఘ్నేశ్వరపూజ పుణ్యాహ వచనము, కొన్ని వ్రతాలూ చేయిస్తే, బియ్యమూ, చిల్లర డబ్బులూ సమృద్ధిగానే దొరికేవి. రోజూ గురువుగారి దర్శనం విజయవాడలో సూర్యం చేసేవాడు. గురువుగారి భార్య అతని సంచీలో తమకు ఎక్కువయిన అరటిపళ్లూ, కొబ్బరి చిప్పలూ పడవేసేది.

తిన్నవి తినగా మిగిలిన వాటిని సూర్యం ఇంట్లో పచ్చడి చేయించేవాడు. అది అన్నాధరువు అయేది. కొబ్బరికూర, కొబ్బరిపచ్చడితో, కూరకొనకుండా కాలక్షేపం అయేది. చింపమ్మ దొడ్లో తోటకూర మడి పెంచేది. పొట్ల పందిరి వేసేది. ఇంటిమీదికి సొరతీగ ఎక్కించేది. కొత్తిమిరి మడి పెంచేది. అందుచేత సాధ్యమయినంత వరకు కూర కొనక్కరలేకుండా సరిపోయేది.

గుణదల ఇంచుమించుగా విజయవాడలో కలిసిపోయిన గ్రామం. సిటీ బస్సులు విరివిగా ఉన్నాయి. ఆ ఊరివాళ్ల ఆడా, మగా, మధ్యాహ్నం సినిమా చూసి సాయంత్రానికి హాయిగా విజయవాడ నుండి ఇంటికి వెళ్లవచ్చు. లేదా ఆడవాళ్లు కూడా భోజనం చేసి బయలుదేరి, టౌనుకు వచ్చి, కావలసిన వస్తువులు, చీరలు సహా, తీరుబడిగా బేరం చేసి కొనుక్కుని సాయంత్రానికి ఇంటికి చేరవచ్చు. ఒక్క

మాటలో చెప్పాలంటే, ఆ గ్రామం మునిసిపాలిటీలో చేరక పోయినా విజయవాడలో ఒక పేటగా చెప్పవచ్చు.

ట్రంకురోడ్డు ప్రక్కగానే ఉన్న తన కుంట పొలంలోనూ, ఏదయినా మాయి త్రవ్వించి, కూర గాయలు కాపించి, విజయవాడకు ఎగుమతి చేస్తే సుఖజీవనం చేయవచ్చునని సూర్యం అనుకున్నాడు. అయితే తన వృత్తికీ, ఈ వృత్తికీ లంగరు కుదర దనుకున్నాడు. దానిలో జొన్నచల్లి, ఒకపూట జొన్నన్నం తినడం అలవాటు చేసుకొన్నాడు. సంపా దన పెరిగినకొద్దీ ఆ అన్నం తినడం మానివేశాడు.

వ్యక్తిలో, మాట మన్ననలో ఆకర్షణ ఉండడం చేతనూ, విద్య క్షుణ్ణంగా రావడం చేతనూ, కంఠంలో స్వారస్యం ఉండడం చేతనూ, గురువుగారే తనకు పని ఒప్పగించాలనే మాటపోయి, విజయ వాడలో మిగిలిన పురోహితులు కూడా, సూర్యాన్ని తమ అవసరానికి వినియోగించుకునే వారు. ఇతడు వెళ్ళినచోట గృహస్థులు చాలా సంతోషించేవారు... ఒక్కొక్కప్పుడు వాళ్ళంత వాళ్ళే సూర్యాన్ని చిల్లర కార్యాలకు పిలవడం ప్రారంభించారు. దానితో సూర్యం పైలు పెరిగిపోయింది.

తెల్లవారినది లగాయితు, ప్రొద్దుగుంకేవరకూ సూర్యం, విజయవాడలో ఉండడంచేత అతడు గుణదల వాస్తవ్యుడనే చాలామందికి తెలియదు. ఇంచుమించుగా అతడు మధ్యాహ్నం భోజనం విజయవాడలోనే చేయవలసివచ్చేది. కనుక అతడు వచ్చిన తర్వాత అతనికోసం వంట ప్రారంభించేది - ఎప్పుడయినా ఇంటికి మధ్యాహ్నం వస్తే. ఇంత జాగ్రత్తగా కాలక్షేపం చేయడంవల్ల సూర్యానికి భోజనానికీ, పై ఖర్చుకూ ఇబ్బంది లేకుండా గడచిపోయేది.

సూర్యం వ్యక్తిత్వం పెరిగేటప్పటికి, ఊళ్ళో

# మగదిక్కు

వాళ్ళకు అతనిమీద అభిమానం పెరిగింది. ఏదో విధంగా అతనికి డబ్బు ముట్టచెప్పాలనే అభిప్రాయం కలిగేది. అల్లా కలిగినవాళ్ళలో అతనితో చిన్నప్పుడు గోలీలాడుకున్నవాళ్ళు కూడా ఉన్నారు. పొలాలు రిజిస్టరు చేసుకోవలసివస్తే, సూర్యాన్ని మధ్యాహ్నం ఆ దారిని అల్లా రిజిస్ట్రారువారి ఆఫీసుకు రమ్మని చెప్పి అతనితో కావలసిన పని ఏమయినా ఉంటే అది ముగించుకుని, ఏదయినా సొమ్ము ముట్టచెప్పే వారు. కొందరతనిని ప్రామిసరీ నోట్లు వ్రాసి పెట్టమని అడిగేవారు.

ఇంగ్లీషు వాసనతో వైదికంలోకి వచ్చినవాడు కనుక, తీరుబడిగా ఉన్నప్పుడు ప్రతి దినమూ పంచాయతీ లైబ్రరీకి వెళ్ళి దిన పత్రికను చదివే వాడు. నవలలూ నాటకాలూ చదివేవాడు. లైబ్రరీ మూసివేసి ఉంటే, ఇంకొకరి దగ్గరకాని, విజయ వాడలో కాని పత్రిక హెడ్డింగులయినా చదువనిది అతనికి తోచేదికాదు.

ఆకాశవాణి కార్యక్రమాలను, అవకాశం ఉన్నప్పు డల్లా వింటూ సమకాలీన పరిస్థితులు అర్థం చేసు కునేవాడు. తాను వెళ్ళవలసివచ్చిన లౌక్యుల ఇళ్ళలో వాటినిగూర్చి చర్చించేవాడు.

"రావయ్యా బ్రాహ్మడా! విజయవాడలో క్రొత్త బొమ్మ వచ్చిందిట! చూసివద్దాం" అని గుణదలలో స్నేహితు లెవరయినా అంటే, వారి కోరికను తప్పక మన్నించేవాడు.

ఏ విషయమయినా చర్చించడం అతని స్వభావం. ఆ చూసిన సినిమాను గూర్చికూడా, తీసుకొని వెళ్ళినవాళ్ళతో చర్చించేవాడు. ఆంగ్లం చదువుకున్నవాళ్ళసాటి లోకజ్ఞానం సూర్యం సంపా దించాడు.

## 3

సరోజినికి హైస్కూలు ఉద్యోగం క్రొత్తగా ఉన్నా, అంత అసౌకర్యంగా మాత్రంలేదు. కొద్ది రోజులలోనే మంచి టీచరని పేరు తెచ్చుకుంది స్టాఫ్ రూములో సహోపాధ్యాయినులు చాలా మంది ఉన్నారు. ఒక ప్రక్క ఒక తెరకూడా ఉన్నది కొందరు ఆ స్టాండింగ్ కర్టెను వెనుకకు వెళ్ళి దుస్తులు సరిచేసుకుంటారు. లేదా రెండు కుర్చీలు లాక్కుని కూర్చొని రహస్యంగా మాట్లాడు కుంటారు.

సరోజిని డ్యూటీలో ప్రవేశించిన రోజున మిగి లిన టీచర్లను ఒక వృద్ధురాలయిన కన్య పరిచయం చేసింది. ఆమె కూడా టీచరే ఆ పరిచయం చేయ బడిన వాళ్ళలో 'సురేఖ' కూడా ఉన్నది. చూడగానే ఆమె అందకత్తె అని సరోజిని అనుకుంది. ఇంట ర్వెల్‌లో స్త్రీ పురుష స్వభావాలను గూర్చి ఆ రోజునే చర్చ జరిగింది. అయితే ఆ చర్చ జరిగేటప్పుడు మాత్రం వృద్ధకన్యలేదు. పని ఉండి తర్వాత పూట కూడా సెలవు పెట్టి వెళ్ళిపోయింది. ఆ చర్చా ప్రసంగం ఇల్లాసాగింది.

"ఏమిటో! ఆడదీ, మగాడూ సమానం అంటారు—ఊరుకోలేక; కొద్ది కేసులు వదలివేస్తే బలశాలి ఈనాటికీ పురుషుడే కదా! అల్లాగే ఈ నాటికీ ఇంటా బయటా ఆధిపత్యం అసలు ప్రపంచం లోనే చెలాయిస్తున్నవాడు పురుషుడే కదా!"

"అల్లా మనమే అనుకుంటే ఎల్లాగమ్మా! మనం వాళ్ళను బలశాలులని అంటే వాళ్ళు మరీ విర్రవీగిపోయి, మనలను అబలనేస్తారు."

"ఆమాట వాళ్ళు ఇదివరకే అన్నారు మనం ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా వారు బలశాలులే క్రోమోజోమ్స్, సెక్సుహార్మోన్‌లు కారణంగా వారికి



### విచిత్ర బంధం

జాతి విద్వేషం, వర్ణ విచక్షణ పెచ్చు పెరిగిపోతున్న నేటి ఆధునిక మానవ సమాజంలో విభిన్న జాతులకి చెందిన జీవులు పరస్పరానురాగబద్ధమై ఉండటం ఆశ్చర్యకరంగానే ఉంటుంది. కోలార్ జిల్లాలోని చిక్‌బల్లాపూర్‌లో మొన్నీమధ్య అలాంటి విచిత్రం కన్పించింది. ఓ కోతి రెండు కుక్కపిల్లల్ని తెచ్చి కన్నతల్లిలా సాకుతోంది. ఆ రెండు పిల్లలూ ఓ రోజు కన్పించకుండా పోయాయి. కోతి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ వాటి కోసం వెతికి వేసారి పోయింది. నాలుగు రోజుల తర్వాత కన్పించిన మరో కుక్క పిల్లని తెచ్చి ప్రాణానికి ప్రాణంగా చూసు కుంటోంది. దీన్ని కూడా ఎవరేం చేస్తారో అన్న భయంతో తనతో పాటే చెట్లపైకి, మేడల మీదికి ఎత్తుకొని తిప్పుతోందిట! ఈ దృశ్యం ఆ వూళ్ళోని వేలాది ప్రజల్ని నిత్యం ఆశ్చర్య చకితుల్ని చేస్తు న్నట్లు తెలుస్తోంది. వొడిలో కుక్కపిల్లని పెట్టు కుని లాలిస్తున్న కోతిని, కాపలాకాస్తున్న మరో కోతిని ఫొటోలో చూడవచ్చు.

(ఫొటో, వార్త పంపినవారు: పి. శాంత్‌కుమార్)

శరీర నిర్మాణంలోనే బలిష్ఠత సంప్రాప్తించింది. అసలు పురుషుడు బలశాలి కాకపోతే, స్త్రీని అంతగా ఆకర్షించలేడు.''

''ఎక్కడో స్త్రీలు కూడా అధికారం చేస్తున్నా, మొత్తం మీద పురుషుడే అధికారం ఎందుకు చలాయిస్తున్నాడు ?''

''పురుషుడు పురుషుడుగా ఎందుకు పుట్టాడు? అనే దానికి సమాధానం ఏమిటో, నీవడిగిన ప్రశ్నకూ అదే సమాధానం, పురుషుడై జన్మించడంలోనే అధికారం చలాయించే లక్షణంతోనే పుట్టాడు. స్వభావాన్ని ఎవ్వరూ కాదని లాభంలేదు.''

''పురుషుల మీద మీకు పక్షపాతం ఎక్కువ.''

''నేను పక్షపాతంతో చెప్పడంలేదు. మనస్తత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయాన్ని అనుసరించి చెబుతున్నాను. ఇక వ్యక్తిగా చూస్తే పురుషులకు చిత్తస్థైర్యం ఎక్కువ. స్త్రీల చిత్తంచంచలం. ఇది స్వభావసిద్ధమైనదని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.''

''అమ్మా! దయుంచి ఇక మాట్లాడవద్దు. నేను వినలేను. నీకు పురుషులలోనే మంచి గుణాలన్నీ కన్పిస్తున్నై. స్త్రీలు చంచల లనేశావు. ఇదే మాట పురుషులూ అన్నారు. నీవు వారి తరఫున వకాలత్ తీసుకున్నట్లున్నావు.''

''నాకు పురుషులలోనే సుగుణాలు కన్పించి స్త్రీలలో కన్పించకపోవు. యంత్రాన్ని అదుపులో పెట్టే నేర్పు పురుషుడి కున్నది కాని, లలితమైన పనులు చేయడంలో నేర్పు స్త్రీదే. స్త్రీ మనస్సు అతివేగంగా చలిస్తుంది కనుకనే, అంటే చలించే స్వభావం కలది కనుకనే, పురుషుడి కంటె ఎక్కువ వివరాలను అతివేగంగా గ్రహించగలుగుతుంది. అంటే బుద్ధి చాలా నిశితమన్న మాట !''

మూడవ టీచరు అందుకుని ఇల్లా అన్నది :

''ఆ మాట మగవాళ్లే ఒక శ్లోకంలో చెప్పారు. స్త్రీకి ఆహారం రెట్టింపట! దానికి రెట్టింపట బుద్ధి ! పురుషుడి కంటె సాహసం ఆరు రెట్లట! కామం ఎనిమిది రెట్లట!''

నాల్గవ టీచరు అందుకుంది :

''ఛీ! ఛీ! పాడు పాడు! పదహారు రెట్లదేమీ శ్లోకకర్తకు తోచలేదు కాబోలు !''

అందరూ నవ్వారు. మళ్లీ మొదటి ఆమె అందుకుంది.

''ఆడవాళ్లు పైపు నీట్‌గా చేస్తారు. గుమాస్తాలుగా, ఉపాధ్యాయినులుగా బాగా రాణిస్తారు. పురుషుడి కంటె ఎక్కువ కాలం బ్రతుకుతారు. పురుషుడికి వచ్చే కొన్ని వ్యాధులు వీరికి రావు. రోగనిరోధక శక్తి స్త్రీలకే ఎక్కువగా ఉంటుంది.''

''అల్లా చెబితే ఎంత శ్రవణపేయంగా ఉంది !''

''మనకంటె అల్పాయుష్కులనీ, మనకంటే ముందు రోగానికి గురి అవుతారనీ చెబితే ఆనందంగా ఉందా ? ఎందుకమ్మా భేదం – మనకు ఆడపిల్లలూ ఉన్నారు, మగపిల్లలూ ఉన్నారు !''

ఎవ్వరూ మాట్లాడలేదు.

''చదువులో చురుకుగా ఉంటారు. ఎక్కువ మార్కులు తెచ్చుకుంటారు.''

''వాళ్లకు పుస్తకాల మీదే ధ్యాస. మగపిల్లలకు పిల్లమీద ధ్యాస !'' మళ్లీ అందరూ నవ్వారు.

''ఆడవాళ్లకు త్వరగా చదువు వస్తుంది.''

''అందుచేతనే త్వరగా మఱచిపోతారేమో ! ఈ సంగతి ప్రహ్లాదుడు తన తల్లి విషయంలో చెప్పాడు.''

''కలిసి మెలిసి ఉండే లక్షణం పురుషులకంటే స్త్రీలకు తక్కువ. ఓర్పు కూడా తక్కువే.''

''ఏమండీ ! అసలు మీరు పొరపాటున ఆడవారయి పుట్టారు కాని, మగవారయి పుట్టవలసింది. వాళ్లనే వెనకేసుకు వస్తున్నారు.''

''స్త్రీలు కవిత్వం బాగా వ్రాస్తారు !''

''పురుషుల గ్రంథాలను అతిక్రమించి వ్రాసిన ఒక రచన చూపండి !''

''పోనీ, కల్పనా శక్తి బాగా కలవారు.''

''అంటే నవలలు వ్రాస్తారనా ?''

''పురుషుల శరీరపు ఉష్ణోగ్రత మొదలైనవి ఒక స్థాయిలో నిలబడతవి. స్త్రీ శరీరం ఉద్రేకానికి గురి అవుతుంది. అందుచేత హిస్టీరియా లక్షణాలు వస్తవి.''

## ఎవరొస్తున్నారని?

— డా॥ సి. నారాయణరెడ్డి

ఇన్నిన్ని ఏర్పాట్లు
ఎవరొస్తున్నారని.

దాతలా విదేశ దూతలా
గాయకులా స్వదేశ నాయకులా
కవులా మహాప్రభువులా
భోగులా రసైకయోగులా ?

ఎవరొస్తున్నారని
ఇన్నిన్ని ఏర్పాట్లు.

ఎవరూ వారెవరూ కాదు.
ఇన్నిన్ని భారీ ఏర్పాట్లు మ
రెందుకో కాదు.

పుట్టగానే నేను –
పొగొట్టుకున్న మృత్యువు
ఈనాడే తిరిగొస్తున్నదని.

విచ్చేసేవారికి తగ్గ
వీడ్కోలు విందును
ఇవాళే ఇవ్వవలసివస్తున్నదని.

ఈ ప్రసంగాలు చేసిన వారు సాధారణంగా ఎక్కువగా మాట్లాడే వారు కాదు. ఎందుచేతనో ఆరోజున అల్లా మాట్లాడారు. కాని వారి చర్చ ఆలోచనలను రేకెత్తించేదిగా ఉన్నదని అందరూ అనుకున్నారు. కాని ఆ టీచర్లతో అందరితో 'ఓహో అంటే ఓహో'గా మెలగడం తప్ప, గాఢంగా ఎవ్వరితోనూ స్నేహం చెయ్యాలని సరోజిని కనిపించలేదు. అకారణంగా, ఒక సున్నితమయిన భావం సురేఖమీద మాత్రం సరోజినికి కలిగింది. పూర్వజన్మానుబంధం ఏమయినా ఉన్నదేమో ! లేకపోతే ఎవ్వరిమీదనూ కలుగని భావం. ఆమె మీద ఎందుకు కలిగింది ? అనుకుంది–సరోజిని.

టీచర్లు ఏ పీరియడ్‌కు ఆ పీరియడ్ క్లాసు ఉంటే క్లాసుకు వెడతారు. లీజరు అయితే స్టాఫ్ రూములో కూర్చుంటారు. ఆ సమయంలో కొందరు నవలలూ, మాసపత్రికలూ, వారపత్రికలూ చూస్తూ కూర్చుంటారు. మరి కొందరు, ఆ రోజున ఇంట్లో వండుకున్న కూరను గూర్చి కానీ, చేసిన పిండి వంటను గురించి కానీ, రాత్రి చేయబోయేదాన్ని గురించి కాని ముచ్చటించుకుంటారు. ఇంకా కొందరు తాము చూసిన సినిమాలో అసభ్యసన్నివేశాలను గురించి 'అయ్యో ! రామ !' అంటూ చెప్పకొని నోరు నొక్కుకుంటారు. కొందరు వింటూనే, ''ఛీ, పాడు !'' అని నేల మీద ఉమ్మిపడకుండా ఉమ్మివేస్తారు. అవికలోపలి ప్రదేశాలూ, కటిప్రదేశాలూ, సినిమాలలో చూపిస్తూ ఉంటే మహిళలు సిగ్గుతో క్రుంగిపోయి, తలలు వంచేసుకోవలసి వస్తోంది. ద్వంద్వార్థాల పాటలూ, అర్ధనగ్న నృత్యాలూ, పిచ్చి ఎగురుళ్లూ, చాలా అసహ్యంగా ఉంటున్నవి. వీటిని మాన్పించే వారేలేరా ?'' అని ఒక స్త్రీ ప్రశ్నిస్తుంది. ''సెన్సారు బోర్డు ఉందిగా !'' అని ఒకరంటే, ''వాళ్ల దృష్టిలో ఇవి తప్పులు కావేమో !'' అని ఇంకొకరంటారు.

''మన స్త్రీలు, ఇల్లాంటివాటిపై గాఢంగా అభ్యంతరం తెలిపి, కొన్నిచోట్ల అసభ్యంగా ఉన్న గోడ కాగితాలమీద తారు పూసేస్తున్నారట !''

''మంచి పని చేస్తున్నారు.''

''అసలు సొమ్ము కోసం మహిళ అల్లా నటించకుండా ఉంటే సరిపోలా ?''

''నటించేదీ మహిళే, ఆక్షేపించేదీ మహిళే !''

''డబ్బు ఎరగా చూపి పురుషుడు ఆడదాన్ని క్రీడా వస్తువుగా మార్చివేస్తున్నాడు.''

''సినిమా చూసేవాళ్లలో సగానికిపై జనాభా మనదేకదా ! మనమంతా అల్లాంటి బొమ్మలు చూడమని కట్టుకడితే సరిపోలా ?''

''అందరూ కలవడం ఎల్లా?''

పై విధంగా ఒకప్పుడు సంభాషణ నడుస్తూ ఉంటుంది – లీజరు పీరియడులలో, ఇంటర్వెల్‌లో జరిగే ప్రసంగాలలో ఎక్కువమంది పాల్గొంటారు. ఒక అరగంట టిఫిన్ తీసుకోవడంతో సరిపోయినా మిగిలిన అరగంటా నిక్కచ్చిగా ఏదో ఒక ప్రసంగం నడుస్తుంది. సరోజిని సాధారణంగా ఇంటికి వెళ్లి, తాను వంటతోపాటు తయారు చేసుకున్న గోధుమ రొట్టెకాని, జొన్న రొట్టెకాని తిని మజ్జిగ త్రాగి వస్తుంది.

## 4

చాలామంది టీచర్లు టిఫిన్ బాక్సులలో మధ్యాహ్నపు ఫలహారాలు తెచ్చుకుంటారు. వాస్తవానికి అవి అల్పాహారాలు – అయితే టీచర్లు అన్నం మాత్రం తెచ్చుకోరు. ఆ టిఫిన్ బాక్సులు కొన్ని అల్యూమినియమ్‌తోనూ, కొన్ని స్టెయిన్‌లెస్‌స్టీలుతోనూ, కొన్ని ప్లాస్టిక్‌తోనూ తయారు చేయబడినవి. బహిరంగంగా చేతులతో పట్టుకువస్తే హోదాకు భంగమని, వాటిని చాటుగా తెచ్చుకుంటారు. కొందరు విద్యార్థులు ''టీచరుగారూ ! ఇవాళ మీరు ఏమి తెచ్చుకున్నారు ?'' అని అమాయకంగా అడుగుతారేమోనని వారి భయం. కొందరు

వాటిని గుడ్డ సంచీలలో తెచ్చుకుంటారు. మరి కొందరు పేము బుట్టలలో పెట్టి తెచ్చుకుంటారు. ఇంకా కొందరు ఫాన్సీ బాక్సులో ఉంచి తెచ్చుకుంటారు. ఫాన్సీ బాగులు కొన్ని మూడేసి అరలున్నవి ఉంటాయి టిఫిన్ బాక్సు కాకుండా, చిన్న అద్దం, ఫేస్ పౌడరు డబ్బా, తిలకం, జేబురుమాలు — ఇవన్నీ పెట్టే 'హోల్డాల్' వంటి బాగ్‌లు ఉంటాయి. వాటిలో ఒక ప్రక్క ఒక వారపత్రికో, మాసపత్రికో, మడిచి దూర్చవచ్చు. వాటిని ఒయ్యారంగా భుజాన తగిలించుకొని స్కూలు గేటుదాకా వచ్చి, అక్కడ నుండి చేతితో పుచ్చుకుని స్టాఫ్ రూమ్‌లో ప్రవేశిస్తారు.

చాలా మంది తెచ్చుకున్న ఫలహారాలను రహస్యంగానే ఉంచుకుంటారు. ఆహారం దోషంవల్ల విజ్ఞాన నాశం అవుతుందనే భయంతో కొందరు బజారు వస్తువులు తినరు. చెక్కుతీసిన దోసకాయ ముక్కలూ, కొత్తిమేరకారం తెచ్చుకుని తింటారు. రోజూ టిఫిన్ తయారు చేసుకోలేని వాళ్ళు, మినపసున్ని ఉండలో, అరిసెలో, జంతికలో, మణుగు బూర్లో, లడ్డూలో మైసూరుపాకో తయారు చేసుకొని నాలుగు రోజులూ అవే తెచ్చుకుంటారు.

అల్పాహార సమస్య ఒక ఇరవై నిముషాలలో తీరిపోయిన తర్వాత అనేక ప్రసంగాలు జరగడం మామూలు. మనిషి ఎదురుగా ఉండగా ఆ మనిషిని గూర్చి అనుకోవడం కంటే చాటున అనే అలవాటే చేసుకున్న వారు వారు. ఈ విన్నవాళ్లలో ఎవరయినా ఈ మాటలు తీసుకు వెళ్ళి అసలువాళ్లతో అంటిస్తారేమో, తగాదా వస్తుందేమో అనే భయం వారికి లేదు. ఎందుచేతనంటే చెప్పిన మనిషి సాక్ష్యానికి రాదు. వచ్చి వాళ్లముందు బ్రతుకలేదు. అన్నమనిషి తానన లేదంటే అన్నావనే వాళ్ళు ఈ చెప్పిన మనిషి తప్ప ఎవ్వరూ ఉండరు. సాక్ష్యానికి రానిమాటలు మాట్లాడవద్దని కథానాయికను వారు దులిపివేస్తారు. అందుచేత స్టాఫ్ రూము ప్రసంగాలు నిరాఘాటంగా సాగిపోతాయి.

సాక్ష్యానికి రాకపోయినా, సురేఖకు తనను గూర్చి తన చాటున తనను గురించి ప్రసంగాలు జరిగినట్లు తెలుసు. ఆమె ఎవ్వరితోనూ స్నేహం చేయకుండా పరాచికాలాడకుండా, ఎవ్వరిని గురించీ చాటుగా కూడా ఎత్తిపొడుపు మాటలనకుండా జాగ్రత్తగా కాలక్షేపం చేసుకువస్తోంది. సరోజిని స్కూలులో ప్రవేశించగానే, సురేఖ మీద ప్రసరించే గాలి సరోజిని వైపుకు తిరిగింది. ఆ ప్రసంగాలు వింటున్న సురేఖకు సరోజిని మీద జాలికలిగింది. సానుభూతి ఏర్పడింది. తనవలె ఆమె కూడా ఏదో పుస్తకం చూసుకుంటూ కాలక్షేపం చేసే మనిషే కాని ఈ సంఘంలో కలిసి వ్యర్థ ప్రసంగాలు చేసే మనిషి కాదనేదే ఆమె మీద ఇష్టంకలగడానికి కారణం. తన మోస్తరుగా, మిగిలిన పంతులమ్మల వ్యాఖ్యానానికి సరోజిని గురి అయినదంటే, తనకు తప్పక దగ్గర అయిందని సురేఖ భావించింది. జట్టుగా కనపడేటట్లుగా ఆమెకు దగ్గరగా కూర్చుని గదిలో మాట్లాడకపోయినా, క్లాసునుండి క్లాసుకు మారేటప్పుడు, ఎల్లాగో అల్లా ఆమెతో రెండు నిమిషాలు ఆప్యాయతతో మాట్లాడేది. ఈ ఆత్మీయతకు సరో

## మగదిక్కు

జిని పొంగిపోయి ఆమెను తన బంధువుగా చూసుకుంటోంది.

సరోజిని ఉద్యోగంలో చేరిన తొలి దినాల్లో, శేషయ్య స్కూలు వదలే వేళకు టంచన్‌గా వచ్చి, గేటు దగ్గర నిలబడి, కూతురుతో కలిసి ఇంటికి వెళ్లేవాడు, తోటి ఉపాధ్యాయినులకు ఇది వింతగా ఉండి చర్చనీయాంశం కూడా అయింది.

"ఎంత తండ్రి అయితే మాత్రం, రోజూ చిన్నపిల్లను వెంటపెట్టుకు వెళ్లినట్టుగా వెళ్లడం ఏమీ బాగుండలేదు."

"పాపం! పాపాయికదూ! ఏ పిల్లి అయినా ఎత్తుకుపోతే!"

"ఇంకా పాపాయి ఏమిటమ్మా! పెళ్లి చేస్తే ఈపాటికి నలుగుర్ని కనేది!"

"బాగా చెప్పావు! మిస్, మిసెస్ ఎప్పుడవుతుందో!"

"అసలు కానేకాదు—నామోస్తరుగా ఉండిపోతుంది" అన్నది వృద్ధ కన్య. అందరూ నవ్వారు.

"ఇంచక్కా, ఎవరి భర్త వారి భార్యను రోజూ గేటుదగ్గరకు వచ్చి, ఇలాగే తీసుకువెడితే!"

"ఫస్టుగా ఉంటుంది. ఏ మొగుడు పెళ్లాం ఎవరో స్పైకి తేలిపోతుంది అందరికీ."

### "సారూప్యం"

ఇంద్రధనుస్సులా క్షణికం ఆనందం
నీటి బిందు లా సామాన్యం జీవితం
కాంతిఛ్ఛటలా ఉజ్జ్వలం ఆనందం
తమోలతిలా నితాంతం జీవితం -
నారికేళ ఫలోదకంలో గుంభనం ఆనందం
చిరికన్నె మధోదయంలా తారళ్యం జీవితం
- రంగనాథ్

"మన భర్తలకు మనమీద నమ్మకం. అందుచేత ఇక్కడకు రారు."

"నమ్మకం ఉందో లేదో! భగవంతుడికి తెలియాలి! కాని వాళ్లకు వచ్చే తీరుబడి మాత్రం లేదు. వారూ తెక్కలమ్ముకున్నవాళ్లే!"

"పెళ్లి కాని పిల్ల! వయసులో ఉంది! ఏ దుర్బుద్ధి పుడుతుందో! లేకపోతే ఏ తుచ్ఛులు ఆమెను వెంబడిస్తారో — అని తండ్రిముండాకొడుకు జాగ్రత్త పడడం తప్పంటారా? ఊరికే అల్లా ప్రేల్లదనంపోతారు!"

"అది కాదమ్మా. బామ్మా!"

అందరూ నవ్వారు. అన్న ఆమెకు కూడా నవ్వు వచ్చింది.

"అది కాదమ్మా! ఇల్లేమో స్కూలుకు దగ్గరాయె! సరోజిని ఈ ఊరు ఎఱుగని మనిషి కాదాయె! కె. జి. పెన్షన్ పిల్లలను స్కూలులో అప్పగించి, తిరిగి ఇంటికి తీసుకువెళ్లినట్లు — అంత బందోబస్తు దేనికంటా!"

"ప్రొద్దున దిగపెట్టడంలేదుగా! సాయంత్రం తీసుకువెడుతున్నాడు కాని! ఒక్కర్తే కూతురు. ఏమీ తోచక రావచ్చు. ఒకప్పుడు ఇంటికి రాకుండా ఏ స్నేహితురాళ్లతోనయినా సినిమాకు వెళ్లవచ్చు అది ఆయనకు ఇష్టం లేకపోవచ్చు."

అయినా ఆడదానికి మగవాడి రక్షణ అవసరమే కదా! నేను పెద్దమనిషి అయిన తర్వాత, ఎప్పుడయిన వీధిలోకి వెళ్లవలసివస్తే, మా అమ్మ, పదేళ్ల మా తమ్ముడిని తోడిచ్చికాని పంపేది కాదు "అమ్మా! ఈ వేలెడు వెధవ నాకు రక్షకుడా!" అని అడిగేదాన్ని. "తల్లీ! అల్లా నన్ను ప్రశ్నించకు నేనూ ఆడదాన్నే. ఆడదాని మనస్తత్వం నాకు బాగా తెలుసు! ఒంటరిగా ఆడది అసలు బయటకు వెళ్లనే రాదు. ప్రక్కవాళ్లు అనేక రీతులవాళ్లుంటారు ప్రక్కనున్న మగవాడు వేలెడు వెధవయినా వాడు మగవాడే. ఆడది జాగ్రత్తగా ఉండడానికీ, ప్రక్కవాళ్లూ తగ్గడానికీ, వాడు రక్షరేకు లాంటివాడు." అని సమాధానం చెప్పేది.

"ఆడవాళ్లకు ఇన్‌సల్ట్! ఈ ఆర్గ్యుమెంటు ఒప్పుకునేది లేదు."

"మీరెవ్వరూ ఒప్పుకోకపోయినా నాకభ్యంతరం లేదు. మా అమ్మ అన్న మాటలు నేను చెప్పాను. మా అమ్మకు ఆ జాగ్రత్త ఉన్నప్పుడు, వాళ్ల నాన్నకు ఆ జాగ్రత్త ఉన్నదీ అంటే, అందులో ఆశ్చర్యం అనేది ఉండకూడదు."

"ఏమయినా, సరోజిని వోణీలు వేసుకునే పిల్ల కాదు. పరికిణీలు కట్టుకునే పిల్లకాదు. చీరకట్ట నేర్చిన ఆడది. గ్రాడ్యుయేటు. బి.యిడి ట్రయినింగ్ అయినది. ఉద్యోగిని. పెళ్ళి ఒకటి కాలేదని మాత్రాన, ఆమె తండ్రి ఇంకా పాపాయే అనుకోవడం అంతబాగ లేదు!"

"యస్! ఈ విషయం ఒక తీర్మానంగా చేసి రేపే గేటుదగ్గర ఆయనకు అందిద్దాం."

అందరూ నవ్వారు. చివరకు మనకెందుకంటే మనకెందుకని అనుకున్నారు.

సురేఖ మాత్రం ఆ చర్చలో పాల్గొనలేదు. అన్నీ గమనిస్తూ కూర్చుంది. ఇంతలో సరోజిని వచ్చింది "ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్" అన్నట్లుగా అందరూ మెదలకుండా ఊరుకున్నారు.

"సరోజినిగారూ! మీరు యమ్.ఏ పరీక్షకు వెళ్లాలని అనుకుంటున్నారుటగా!" అన్నది ఒక మహిళ.

"ఇంకా అనుకోవడంలోనే ఉంది."

"అయి ఏమి చేస్తారు?" అన్నది [illegible] పంతులమ్మ.

"నా పేరు ప్రక్కన వ్రాసుకుంటాను, సర్వీసు రిజిస్టరులో కూడా వ్రాస్తారు."

"ప్యాసవడం మంచిదేనమ్మా!. చదువలేని వాళ్లం మేమంతా ఎల్లాగూ చదువలేం. చదివినా చదువు వంటపట్టే వయస్సుకాదు. ఇంటిదగ్గర జంజాటానా! బాదరబందీలు ఎక్కువ.

నీకు ఇంకా పెళ్లికాలేదు కనుక చదువుకోడానికి బోలెడు విశ్రాంతి ఉంది. చక్కగా చదువుకోవస్తే కాలేజీలో ఉద్యోగం వస్తుంది. లేకపోతే ఇన్‌స్పెక్ట్రస్ అయిపోయి, డి.యి.ఓ. అయిపోయి మన స్కూలుకు తనిఖీకి రావచ్చు."

అందరూ నవ్వారు.

[ ఇంకా ఉంది ]



## చేసిన పరీక్షల వలన తేలింది...





# రుచికీ,
# విటమిన్లకూ, పుష్టికీ
# బిస్కట్ అంటేనే ఇది

బ్రిటానియా

# గ్లూకోజ్-డి



బ్రిటానియా గ్లూకోజ్–డి బిస్కట్లతో పాటు మరో ప్రముఖ బ్రాండ్ గ్లూకోజ్ బిస్కట్లను పోల్చి చూసేందుకు చేసిన పరీక్షల వలన తేలిందేమిటంటే: విటమిన్లు మరియు మొత్తం మీద పుష్టినిచ్చే పదార్థాలు గ్లూకోజ్–డిలో ఎక్కువగా ఉన్నాయని. అంతేగాక రుచికోసం, తియ్యదనం కోసం, కరకరలాడే తనానికి దీనివి కావాలంటారని. శక్తినిచ్చే విషయంలో, గ్లూకోజ్ కన్న గ్లూకోజ్ డి 20% ఎక్కువ శక్తినిస్తుంది!

బ్రిటానియా గ్లూకోజ్–డి–తియ్యటి రుచితో కూడిన శక్తి!




అందుకే మరి ఏ ఇతర గ్లూకోజ్ బిస్కట్ కన్న బ్రిటానియా గ్లూకోజ్-డి అంటేనే ఎక్కువ మంది ఆకర్షితులవుతున్నారు.

బ్రిటానియా బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-B3C.GL-16-140TL



# సంగీతపు జల్లు

కొలపల్లి ఈశ్వరరావు

ఏమండోయ్! ఇటురండి! ఇక్కడ నే నొక్కదాన్నే వంట చెయ్యలేక ఛస్తున్నాను. కాస్త సహాయం చెయ్యండి!'' అర్థింపుగా అడుగుతున్న భార్యవంక సుబ్బారావు జాలిగా చూశాడు.

వెంటనే రంగంలోకి వురికాడు. వంట కార్యక్రమం నిర్విఘ్నంగా ముగిసింది.

ఆ రోజు ఆదివారం. సుబ్బారావు తీరిగ్గా వుండే రోజు. భార్యభర్తలిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం అయిందనిపించారు.

పేపరు చూస్తున్న సుబ్బారావు లోపలున్న భార్యకు ఆర్డరిచ్చాడు—

''రత్నం వక్కాకు తీసుకురా''

భార్యా రత్నం వక్కాకు పళ్లెంతో హాజరయింది. రత్నం ముఖం ఎందుకో వెలిగిపోతున్నది.

''ఏమిటి విశేషం'' అన్నట్లు చూశాడు సుబ్బారావు భార్యవంక.

''ఏంలేదండి!'' తమలపాకు చిలకలు అందిస్తూ సిగ్గుపడింది.

ఆడవాళ్లు తమకై తాము దగ్గరకు వచ్చారంటే, ఏదో వుండి వుంటుంది. సుబ్బారావు చిలిపిగా భార్యకళ్లల్లోకి చూశాడు. బరువుగా రత్నం కనురెప్పలు క్రిందకు వాలాయి, సుబ్బారావు చూపుల ధాటికి తట్టుకోలేక.

''అదికాదండీ! నేను ... నేను త్వరలో ... మాట పూర్తి చెయ్యలేక పోయింది. సుబ్బారావు గుండెల మీద వాలిపోయింది. సుబ్బారావు ఆలోచనలో పడ్డాడు. ఆడవాళ్లు ఇంతగా సిగ్గుపడేది ఎప్పుడు? చెప్పవలసిన మాటలు నోటిలోనే వుంటాయి! కాని చెప్పలేరు! ఎదుటి వాళ్లే ఆ విషయాల్ని తెలుసుకోవాలి!!!

సుబ్బారావు మెదడు చురుగ్గా పనిచేసింది. ముఖం సంతోషంగా వెలిగింది.

''అమ్మదొంగా! నాకు చెప్పకుండా దాద్దామనుకున్నావా? నేనెలా కనిపెట్టేసేనో చూడు.'' సుబ్బారావు చిలిపిగా భార్యవంక చూశాడు.

తను చెప్పకుండానే ఆ విషయం భర్తకు ఎలా తెలిసిందోనని కంగారుపడుతున్న రత్నాన్ని—

''ఇంక నువ్వేం చెప్పకు! నేనేమి వినను! ఈ రోజు ఎంత సుదినం? నాకెంతో సంతోషంగా వుంది! రత్నం! వుండు ఇప్పుడే వస్తా'' అంటూ ప్యాంటు వేసుకుని బజారు కెళ్లాడు.

'ఇన్ని' ప్యాకెట్లుతో తిరిగొచ్చాడు.

''ఏమిటండీ! ఇవన్నీ?'' అంది రత్నం సగం ఆశ్చర్యంగా: సగం సంతోషంగా, ఆ ప్యాకెట్లలో చీరలుండటం గమనించి.

''ఏంలేదు లేవోయ్! ఇవన్నీ నీకే! ఊఁ దేవిగారు త్వరగా స్వీకరించాలి!''

అన్ని ప్యాకెట్లు విప్పి పెట్టాడు. రకరకాల స్వీట్సు, చీరలు, చిన్నపిల్లలాడుకునే బొమ్మలు' ఇంకా ... ఇంకా ...

ఇవన్నీ ఎందుకో రత్నానికి అర్థంకాలేదు ప్రశ్నార్థకంగా భర్తవంక చూసింది.

''ఏమిటి అలా బిత్తరపోయి చూస్తావు? ఇవన్నీ మనకే! చాలా ఖర్చయిందని బాధపడు

# ఎల్ ఐ సి వారి

# 'మనీ బ్యాక్' పాలసీలు

## (డబ్బు ముందు చెల్లించు పాలసీలు)

## అవసరమైనప్పుడు డబ్బు.

## సత్వర రాబడులు

## జీవిత భీమా రక్షణ

ఇదుగో ఆశ్చర్యకరమైన లైఫ్ ఇన్సూరెన్స్ పాలసీలు— పాలసీ గడువు తీరుటకు ముందుగానే సక్రమ వ్యవధులలో డబ్బు వాపసు మీకు చేయబడగలదు. ఈ సకాలంలో చెల్లింపబడు డబ్బు మీకు మీ పిల్లల పెండ్లి, చదువు, ఇంటికి నగదు చెల్లింపు లేక మీ వ్యాపారానికి అగనపు డబ్బు లాంటి అవసరమైనప్పుడు మీకు అవసరమైన మొత్తాలలో లభిస్తుంది.

పాలసీ గడవు తీరుటకు ముందు సక్రమంగా ప్రతి కొద్ది సంవత్సరాలకూ వాయిదాల మొత్తాలలో డబ్బు మీకు చెల్లింపబడగలదు. ఉదాహరణకు మీరు 12 సంవత్సరాల పాలసీ తీసుకోవచ్చు. 4 సంవత్సరాల అనంతరం మీకు మొత్తం భీమా చేయబడిన దానిలో 20%కు లభిస్తుంది. 8 సంవత్సరాల అనంతరం, మరొక 20%కు చెల్లిపబడగలదు. మిగిలిన 60% మీకు12 సంవత్సరాల చివర చెల్లింప బడగలదు 12 సంవత్సరాల పాలసీ కాలంలో మరణము సంభవించినచో భీమా చేయబడిన మొత్తం చెల్లింప బడగలదు—లోగడ చెల్లింపబడిన మొత్తాలతో నిమిత్తం లేకుండా.

దీనికి తోడు, సంవత్సరం తదుపరి సంవత్సరం మొత్తం భీమా చేయబడిన డబ్బుపై బోనసు గూడా లభిస్తుంది. ఈ పాలసీ 12 మరియు 15 సంవత్సరాల కాలములకు లభించును.

ఇది అపూర్వమైన పాలసీ. మీకు డబ్బు చేతిలో వచ్చునట్లు చేస్తుంది అదనంగా పూర్తి జీవిత భీమా రక్షణ. ఇది మీకు మెరుగైన సేవచేయు నిమిత్తం రూపొందించబడింది. మీ ఏజంటును వివరాలకు అడగండి—ఇప్పుడే.





**ఎల్ ఐ సి మీ కోసం ప్రగతి పథంలో!**




లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

తున్నావా ? ఆ బాధలేం పెట్టుకోకు ! నువ్వింక నిశ్చింతగా, ఎప్పుడూ నవ్వుతూ, సంతోషంగా వుండాలి ! ఊఁ నోరు తెరు--'' ఒక స్వీటు తీసి రత్నం నోట్లో సగం పెట్టి తను సగం తీసుకున్నాడు.

భర్త ప్రేమకు, అనురాగానికి రత్నం పరవశించి పోయింది. అతని గుండెల మీదవాలి తృప్తిగా కళ్ళు మూసుకుంది. సుబ్బారావు కౌగిలిలో రత్నం గువ్వలా వొదిగిపోయింది.

* * *

ఆ రోజు నుండి సుబ్బారావు బజారు నుండి ఏదో ఒకటి తెచ్చేవాడు. వాటిలో ముఖ్యంగా పిల్లల బొమ్మలుండేవి. రత్నానికి ఏం అర్థం కాలేదు. సుబ్బారావు అక్కయ్య వాళ్ళు వస్తారేమో ! వాళ్ళ పిల్లలు ఆడుకోటానికి తెస్తున్నాడేమోనని సరి పెట్టుకుంది.

సుబ్బారావు దిన చర్య పూర్తిగా మారిపోయింది. ఆఫీసుకు పోయేవరకు భార్యకు వంటపనిలో సహాయం చెయ్యటం, సాయంత్రం షికారుకో, సినిమాకో రత్నాన్ని త్రిప్పటం, ఏ హోటల్లోనో తృప్తిగా భోంచేసి ఇంటికి వచ్చి పడుకోవటం — ఇదీవరస !

రత్నాన్ని పెద్ద పెద్ద పనులు చెయ్యవద్దనే వాడు. ''ఆ పనులన్నీ నేచేస్తా, మిగతా పనులు నువ్వుచూడు'' అంటూ ప్రతిపనిలో కల్పించుకునే వాడు.

రత్నానికి రోజులు సంతోషంగా, హాయిగా గడిచిపోసాగాయి.

ఇప్పుడు ఎన్నడూ లేనంతగా ఉత్సాహంగా వుంటుంది. రోజూ రకరకాల పిండివంటలు చేసేది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోంచేసే వారు.

సుబ్బారావు ఒకరోజు పనిమనిషిని తీసుకుని వచ్చాడు. రత్నం కోప్పడింది.

''ఎందుకండీ ! ఇద్దరికి పనిమనిషి. ఈ మాత్రం పని నే చెయ్యలేనూ ? ! భర్తకు వండి పెట్టలేని ఆడదాని జీవితం ఎందుకు ? మనిద్దరము కబుర్లు చెప్పుకుంటూ సంతోషంగా మనకు కావలసినవి చేసుకుంటాము ! కాని ఈ పని మనిషి ఏం చేస్తుందో ఏమో ? అదీగాక మన మధ్య అడ్డం'' తెలుగు సినిమా హీరోయిన్‌లా వుపన్యాస మిచ్చింది రత్నం.

కాని, సుబ్బారావు వొప్పుకోలేదు. ''వీల్లేదు! నువ్వు మారు చెప్పు, పనిమనిషి వుండవలసిందే ! నువ్వింక ఎక్కువ పని చేయటం మంచిదికాదు. తరువాత బాధపడి ప్రయోజనం లేదు. ముందు జాగ్రత్త తీసుకోవటం మంచిది'' అటువంటి విషయాలు నీకన్నా నాకే బాగా తెలుసు అన్నట్లుంది సుబ్బారావు వాలకం.

ఐదు నెలలు ఇట్టే గడిచిపోయాయి. సుబ్బారావు, రత్నం ఎంతో సంతోషంగా కాలం వెళ్ళబుచ్చసాగారు. ''ప్రపంచంలో వున్న అన్యోన్యమైన దాంపత్యములలో మాది ఒకటి'' అన్నట్లు మెలగసాగారు. ఇరుగు పొరుగువారు ఈర్ష్య పడ్డారు.

ఒకసారి సుబ్బారావు తీరిగ్గా వున్నాడు. పేపరు చూస్తున్నవాడల్లా ఇటు తిరిగి రత్నం వంక తదేకంగా చూడసాగాడు.

## సంగీతపు జల్లు

''ఏమిటి ? అలా చూస్తున్నారు ? కళ్ళతోనే ప్రశ్నించింది రత్నం చిలిపిగా !

''ఏంలేదు !'' కళ్ళతోనే జవాబిచ్చి పేపర్లో తల దూర్చాడు. అతని మెదడు ఆలోచించటం మొదలు పెట్టింది.

''ఇప్పటికి ఐదు నెలలు గడిచాయి ! రత్నం 'ఆ' వార్త చెప్పి ! కాని అటువంటి లక్షణాలు రత్నంలో కనపడటంలేదే ! సహజంగా ఐదు నెలలకు ఆడవాళ్ళలో మార్పు కలుగుతుంది. ముఖం మును పటికన్నా అందంగా వుండటం, బరువుగా నడవటం ... ఆ మార్పు లేమీ రత్నంలో రాలేదు. కారణం ఏమిటి చెప్మా ?''

తన సందేహాన్ని తీర్చుకునేందుకు భార్యా రత్నాన్ని పిలిచాడు,

''ఆఁ వస్తున్నా !'' అంటూ వంటింట్లో నుండి వచ్చి భర్త ప్రక్కన కూర్చుంది.

సుబ్బారావు పరిశీలనగా, కళ్ళు ఇంతచేసి రత్నం వైపు చూశాడు.

''ఏమిటండీ ! ఇందాకటి నుంచి అలా చూస్తున్నారు ! నా ముఖంమీద మసిగాని వుందేమిటి ?'' ముఖాన్ని గట్టిగా రెండు చేతులతో తుడుచుకుంది.

ఎలా మొదలు పెట్టాలో సుబ్బారావుకు అర్థం కాలేదు ! ఏమని అడగాలి ? ఎలా అడిగితే బావుంటుంది ? సుబ్బారావు మెదడు చురుగ్గా పని చేసింది.

గబగబ లోపలికి వెళ్ళాడు.

భర్త ప్రవర్తన అర్థంగాక నిలువు గుడ్లేసుకుని చూడసాగింది రత్నం !

అంతకు ముందు తెచ్చిన పిల్లల ఆట వస్తువులతో తిరిగి వచ్చాడు.

''ఎందుకండీ ! అవన్నీ ?'' ప్రశ్నార్థకంగా భర్తవంక చూసింది.

'చెప్తా'గా' అంటూ కుర్చీలో కూర్చుని—''ఈ వస్తువులను ఎందుకు తెచ్చానో తెలుసా ? నీవు త్వరలో పాపాయిని అందిస్తావని.'' ఎలాగో పూర్తి చేశాడు సుబ్బారావు.

''ఇది మరీ బాగుందండీ ! మీ రివన్నీ తెచ్చారని నన్ను......'' ఆపై ఇంక చెప్పలేక పోయింది సిగ్గుతో.

''అయితే అటువంటి విశేషమేమి లేదన్న మాట !'' తను చేసిన ఖర్చు గుర్తు చేసుకుంటూ నిరాశగా అడిగాడు సుబ్బారావు.

''అటువంటి ఆశలేవీ పెట్టుకోకండి ! ఇప్పుడల్లాంటి విశేషాలు జరుగవు !'' తుర్రున వంటింట్లోకి దూరింది.

ప్రగతికి మూలం

క్రమశిక్షణ

అంత పెద్ద మనిషి సుబ్బారావు నిలువునా నీరుకారి పోయాడు.

''అయ్యో ! దేముడా ! ఎంతపని చేశావురా ?'' రెండు చేతులు తలమీదుంచుకున్నాడు. కాని, వెంటనే ఆనాడు రత్నం సిగ్గు పడుతూ చెప్పబోయిన విషయం ఏమిటి అయి వుంటుందా ? అని—

''రత్నం'' మరలా పిలిచాడు.

''మళ్ళీ ఏం వచ్చిందండీ ! ఈసారి మీరే మన్నా...'' పైటకొంగు చాటున నవ్వింది.

''నీకురాని విశేషం నాకు వస్తుందా ? అదినరే గాని ఇలారా, ఆ రోజు మరి నువ్వు సిగ్గుపడుతూ చెప్పబోయిన సంగతేమిటి ?'' ఆఖరి అస్త్రం ప్రయోగించాడు.

''ఓస్ ! అదా !'' పకపక నవ్వింది. ''ఎంత పిచ్చివారండీ !'' మళ్ళీ నవ్వింది రత్నం. ''మీరెంత అమాయకులండీ ! ఇంత ఖర్చుచేసింది అందుకా ?'' రత్నానికి నవ్వాగింది కాదు. ఎలాగోలా నవ్వు మధ్య భర్తకు అసలు విషయం చెప్పింది.

''ఆ రోజు వుదయం ప్రక్కింటి పిన్నిగారు పిలిచారు. ఎందుకోనని వెళ్ళాను.''

''ఏమమ్మా ! రత్నం ! ఏమిటి మరీ నల్లపూసవయ్యావు ! కంటికి కనిపించటంలేదే !'' అంటూ అసలు విషయం మొదలు పెట్టారు.

''ఏంలేదమ్మా ! మావారు నాకు సంగీతం నేర్పిస్తానన్నారు ! మాస్టారుగారిల్లు చాలా దూరమట. ఒక్కదాని కొరకు రావటం కష్టమౌతుందని అన్నారు. మరి నువ్వు కూడా చేరతానంటే, ఇద్దరం నేర్చుకుందాం ! ఇప్పుడు సంగీతానికి ఎంత విలువుందని ! అందులో నీ గొంతు కమ్మగా వుంటుంది,'' అన్నారు పిన్నిగారు.

''మా వారినడిగి చూస్తానండీ'' అన్నాను.

ఆ రోజు నేను ఆ విషయమే అడుగబోయాను కాని మీరు నన్ను సాంతం చెప్పనిస్తేగా ? సంగీతం విషయం చెపితే మీరు నవ్వుతారేమోనని అలా సిగ్గుపడ్డాను. కాని మీరు నా సిగ్గును మరో విధంగా అర్థం చేసుకున్నారు ! తరువాత రోజు పిన్నిగారే అన్నారు ''తను నేర్చుకోవటం లేదని, ఎందుకమ్మా సంగీతం ? కచ్చేరీలు చేస్తామా, ఏమ్మన్నావా ?''

నాకు నవ్వాగిందికాదు. అంతటితో నా సంగీత కార్యక్రమం ముగిసింది. మీ వద్ద మరలా ఆ ప్రస్తావన తీసుకురాలేదు.

అదీ సంగతి ! ! !

రత్నం వంటగదిలోకి దూరింది.

సుబ్బారావు చెవుల్లో ఇంకా రత్నం మాటలు గింగురు మంటున్నాయి !

''అయ్యో ! భగవంతుడా ! ఆ రోజు సంతోషంలో ఎంత ఖర్చు చేశానో !''

''ఎలాగైతేనేం ? ఈ ఐదు నెలలు రత్నం రాజభోగం అనుభవించింది'' అనుకున్నాడు నిట్టూరుస్తూ !

చివరకు తన తప్పేమిలేదన్నట్లు—

''ఆడవాళ్ళ చేష్టలకు అర్థాలేవేరులే !'' అని అనుకున్నాడు సుబ్బారావు.

# కేవ్వళి

## కె. రామలక్ష్మి

**యు. ఎస్. ఆర్. రాజమండ్రి**

మీకు ప్రశ్నలకు జవాబులు ఇవ్వడం తప్ప ఇంకేం పనిలేదా ?

ఇది పని కాదా ?!

**కె. ఎస్. విశాఖపట్నం**

భార్య కష్టసుఖాలను ఆలోచించని భర్తలను ఏమనాలి ?

ఏమనీ ఏం ప్రయోజనం ? .... ఆ భార్యను చూసి జాలిపడాలి... మీరేం బాధపడకండి యీ దేశంలో నూటికి ఐదుగురు కూడా వుండరు—భార్యని ఆదరణతోనే కాదు మనిషిగా కూడా చూసేవాళ్లు... ప్రతి చిన్న విషయానికీ యీసడిస్తూ, ప్రతి చిన్న పొరపాటుకీ సాధిస్తూ ఇల్లాలిని చెప్పుకోలేని నరకయాతన పెట్టేవాళ్లు చాలామంది వుంటారు. ఆధారపడి బ్రతికేవాళ్లకి అంతకంటే ఆదరణా గౌరవం అనవసరం అనుకుంటారు.

**డి. వి. ఆర్. కె. ఆర్. హైదరాబాద్**

వృద్ధికి మూల కారణం స్త్రీ అంటారు అలాంటి భారతనారి తన ఒళ్లు ప్రదర్శిస్తూ తన హక్కులకు పోరాడటం స్త్రీ జాతికే సిగ్గుచేటు. ఇలాంటివారిని వెనకేసుకొస్తారెందుకు ?

వృద్ధికి మూల కారణం అయిన స్త్రీని మీరంతా పురుషుని చూసినట్లు చూస్తే తప్పు కాదుగాని, ఆడది హక్కుకోసం పోరాడ్డం సిగ్గు చేటా ?! అనలీ ప్రశ్నవేసే ముందు క్షణం ఆలోచించి అడగవలసింది మీరు.

**పి. ఎస్. కామారెడ్డి**

... ఎవరికైనా హక్కులనేవి ఆత్మశక్తిలో నుంచి తలెత్తుతాయి. వాటిని తీసుకోవడం ఇవ్వడం అనేది తన నైపుణ్యత మీద సమర్థత పైనే ఆధారపడి వుంటాయి. ఈ నిజాన్ని గ్రహించండి.

ఇలా అరిటిపండొలిచి చేతపెట్టినట్టు చెప్పాకేనా గ్రహించమనా సోదరా, అంటే బలవంతుడు బలహీనుడిని అణచివేయడం బడుగు ప్రాణులని నెట్టి వేయడం, ఇవన్నీ సహజమైన హక్కులన్నవగాలు ! గట్టిగా అనకండి ! ఎవరేనా వింటే నవ్వి పోగలరు ! మీ హక్కుల నిర్వచనం విని.

**ఎం. వి. ఏ. బెంగుళూరు**

ఆడదానికి మగాడుముఖ్య తోడులేనిదే, మగవాడి తోడులోనువున్న సుఖం దేనిలోను లేదంటాను. మరి ఎందుకు ఇలా ప్రాకులాడుతారు?

మగాడుముఖ్యతోడు స్త్రీకి ఎన్నోఆశలతో పాటు హక్కుల కూడా ఇస్తుందనీ మగవాడికి తోడూ నీడగా వుండడం అంటే యజమానీ బానిసగా వుండడం కాదనీ మీ మగవాళ్లు గ్రహించేవరకూ ఇలా ప్రాకులాడుతూనే వుంటారు ఆడవాళ్లు.

**పి. జె. ఆర్. విశాఖపట్నం**

మీ స్నేహితులే మిమ్మల్ని...

చూడండి నాదొకటే పద్ధతి 'స్నేహితు'లని గురించి చెడుచెప్పినా వినను. శత్రువు గురించి చెడు మాట్లాడ నక్కరలేదు.

**వి. కె. ఆర్. ఖాజీపేట**

నా మంచితనం నా పట్ల నేరం అయింది. నా మంచి తనాని అసరాగా తీసుకుని నన్ను చులకనగా చూస్తున్నారు....

మంచి తనం "చేతకాని తనం"గా కన్పిస్తే అంతే చేస్తారు.

**సి. హెచ్. ఎస్. ఆర్. విశాఖపట్నం**

మీ రచనలు బాగా వంట పట్టినట్టునాయి మా శ్రీమతి పెళ్ళంటే కొత్త నిర్వచనాలు చెప్తోంది....

శుభం. ఇంకా ఎందరో గృహిణులు వివాహానికి నిజమైన నిర్వచనాలు తెలుసుకుంటే ఈ సమాజం యింత కంటే వెయ్యిరెట్లు మెరుగ్గా వుంటుంది!

**బి. ఓ. ఆర్. కేరాఫ్ 99 ఎ. పి. ఓ.**

ప్రవాసాంధ్రులంగా వుంటున్న మేము పత్రిక రాగానే ముచ్చటగా వుండే మీ శీర్షిక చదువుతాం. కాని మా మిత్రు డొకడు 'ఈమె జవాబులు చూస్తే వొళ్ళుకోపం వస్తుంది.' అంటూ పేజీ తిరగవేయబోతూ కూడా తిరిగి. మీ సమాధానాలను చదవకుండా వదలిపెట్టడు దీనికి కారణం?

తిట్టుకుంటూ కూడా చదివించే యీ శీర్షిక కొందరిని తట్టి అద్దంలోలా వాళ్ళముఖాలు వాళ్లకి చూపుతూంటుంది. అందుకే ఆ ఒళ్ళు మంట !

**బి. యు. ఆర్. కడప**

'అందరి రాతలు రాసేది ఆదేవుడే—ఆడదాని రాత రాసేది మగవాడు' అని ఒక ప్రఖ్యాత కవి అన్నారు...

అయితే ఏం ? 'చేతిరాత బాగాలే'దని కొట్టి పారేయండి !

**పి. ఎస్. ఆర్. గోపాలపురం**

కె. రా. గారూ, మీకేమైనా కోరికలు వున్నాయా?

ఎందుకుండవు? నేనేం మనిషిని కానా ?!

**ఎస్. ఎస్. ఎస్. ఎస్. శ్రీహరికోట**

మగవానిని కాదని ఆడది ఏ విషయంలో స్వతంత్రముగా ముందంజ వేయకలదు. మగవారివలె స్కూటరు నడుప కలదా? విమానంనడువకలదా?

శ్రీహరికోటవంటి చోటునుంచా యీ ప్రశ్న వేస్తున్నారుస్వామీ!.........స్పేసులో వెళ్ళివచ్చిన తొలి మహిళని ఎవరెస్టుపై జాతీయ పతాకము పెట్టిన స్త్రీని,.........ప్రపంచం మొత్తంమీద ఒంటరిగా విమానంలో పయనించి వస్తున్న స్త్రీని రాజ్యాలకి పెద్దరికం వహిస్తున్న మహిళలని గురించి ఎప్పుడూ వినని లేదా?



"ఆ పోర్షన్ బాగానే వుందిగా, ఫిక్సప్ చేసేద్దాం" అన్నాను బయటకు రావడంలోనే.

'వెయిట్, వెయిట్! ఇంకా ఒకటి రెండు యిళ్ళు చూసీ...'

'ఇంకా చూడడా లెందుకని? విసుగొచ్చేసింది తిరగలేక; నా ఓపిక కాస్త యీ తిరుగుళ్ళతో హరించిపోయింది. అసలు నీ చాదస్తం అర్థం కాకుండా ఉంది యింతకన్న మంచి పోర్షన్ యీ రీజనబుల్ రెంట్‌లో.'

మాట పూర్తి కాకుండానే అందుకున్నాడు మూర్తి 'నీకు కోపం రాకపోతే చెప్తా, మనం చిన్నప్పుడు కథ చదువుకోలేమూ, ఆ నల్లమేక బాహ్మడికి నీకూ పోలికలో యేం తేడా లేదనుకో! గట్టిగా యెవరైనా వాదిస్తే అప్పనదంతప్పు కాదనడం..

'మా వంశంలోనే లేదు మా తాత అంతేనట, మా నాన్న సరేసరి, యిప్పుడు నేనూ మువ్మూర్తులా అంతే!'

'విన్నాము లేవోయ్ మహా! అపర హరిశ్చంద్రుడు బయల్దేరాడని! అది గొప్పకాదు, పిరికితనం అంటారు ఈ రోజుల్లో!...నువ్వు చూడలేకపోయినది నేను చూసినది చెప్పమంటావా. ఆ హౌస్ ఓనర్ను లేరూ, వాళ్ల సన్నాయి నొక్కుల మాటలు వినగా, నా ఎసెస్‌మెంట్ ప్రకారం వాళ్ళు అట్టే రోజులు మిమ్మల్ని యింట్లో ప్రశాంతంగా ఉండనివ్వరేమో అనిపిస్తోంది!'

నేను సిగరెట్ తీసి వెలిగించాను పొగ పీల్చి వదిలి 'నువ్వో నీ పెసిమిస్టిక్ ఔట్ లుక్ చూస్తే నాకు వెర్రెత్తు తూంది చెప్పద్దూ! అసలు మూడు గదులు అరవై రూపాయల రెంట్, సెప్టిక్ లేవెటరీ- మా లీం కోరిక లన్నీ తీరాయి ఎక్సెప్ట్ బాత్‌రూమ్. దానికి కూడ పాపం యింటాయన ధనాభావం వల్ల చేయించలేదు. ప్రస్తుతానికి నూతి పక్కనే తడికలలో చాటు ఏర్పాటు చేయిస్తానన్నారుగా!" అన్నాను యింటాయనపై సాను భూతి ప్రకటిస్తూ.

"ముందు ఓ సిగరెట్ యిలా పారెయ్యి"

మూర్తి సిగరెట్ ముట్టించి బజారు వైపుకు నడక సాగించాడు మౌనంగా.

వాడు మాట్లాడకపోడం చూసి నాకు ఉండబట్టలేని స్థితిపట్టి "ఇంతకూ నువ్వనేదేమిటని ?" అడిగేసాను.

"అదే ఆలోచిస్తున్నాను! ... లేవేటే యిద్దరికీ కామన్, నుయ్యికామన్, కరెంట్ నిమిత్తం పదిరూపాయలిమ్మన్నా సెపరేట్ మీటరు లేదుకనుక అదీ కామనే, బట్టలారేసుకోడానికి ఎండాకాలంలో పడుకోడానికి ఉపయోగించే వెనకవైపువున్న దొడ్డి కామన్, ముందువైపు పాచిచేసి ముగ్గులువేసే అంగణం కామన్!"




'అయితే ఏమయిందనీ ?'

'మగాళ్లకు తెలీదు బ్రదర్! సాధారణంగా యీ కామన్ వ్యవహారాల్లో ఆడవాళ్ల మధ్య తగాదాలు వచ్చే ప్రమాదం ఉందనే శంకిస్తున్నాను...పైగా ఆ వృద్ధ దంపతుల నిర్ధర్ష్య స్టడీ చేసానుగా, ఛాందసుల్లా ఉన్నారు. రాత్రి పదిగంటలు దాటి మీరు మాత్రం లైట్లు యెందుకు ఉంచుతారు అని ఆయన అంటే, నేనేమో రోగిష్టిదాన్ని కష్టం సుఖం పంచుకోడానికి వీలుగా నాకూ ఒక తోడు దొరికినట్టవుతుందని ఆవిడ అంది గురు లేరూ ?"

"లేకేం!"

'మీరు పదిగంటలు దాటాక లైట్లుంచినా మీ ఆవిడ యింటావిడకు సహకరించక పోయినా వాళ్లిద్దరూ మీ పాలిటికి జెక్ 'బస్సయిపోతారేమో అనే!"

'నీ ఊహా భయాలలో చివరకు నాకు పోర్షన్ దొరక్కుండా చేసేలా ఉన్నావ్! ... వాళ్ళు నిజంగా టబుర్ మేకర్స్ అయినా మన మంచితనంతో వాళ్లను మార్చుకునే

యిది ఉండాలోయ్!'

"సరే, నీకాధైర్యం ఉంటే మధ్య నాదేం ఉంది!...పద, టీ తాగుదాం" అంటూ ప్రక్క నున్న హోటల్ వైపుకు త్రోవతీసాడు మూర్తి.

ఆ రోజున మూర్తి అన్నమాటలు యివాళ పదేపదే గుర్తుకు వస్తున్నాయి... మడత మంచంమీద లీల అటు తిరిగి పడుకుని ఉంది. కదలడంలేదు, నిద్రపట్టిందేమో! చిన్న దగ్గు దగ్గాను, ఆమె నుంచి రెస్పాన్స్‌లేదు.

"పిన్నిగారు చాలమంచి వారండీ!... వాళ్ళింట్లో యేదయినా 'స్పెషల్' చేస్తే నా కూతురు వంటిదానవు నువ్వూ తినమ్మా అంటూ పెడుతున్నారు" అంది లీల ఒకసారి

"కూతురు సరేగాని, యీ అల్లుడేం పాపం చేసాడుట?"

"బావుంది, నన్నే తిన మంటూ కాస్త పెడితే మావారికి కూడ మరోకాస్త పెట్టండంటూ యెలా అడుగుతాం?"

'అడక్కపోయినా, యేంతయినా అర్ధాంగివి కదా. నీకు పెట్టిందాంట్లో సగం నాకు పట్టుకొచ్చెయ్యవలసింది...చిన్నప్పుడు నేనేం చేసేవాడినో తెలుసా! సమారాధన భోజనానికి వెళ్ళినప్పుడు, వడ్డించిన బూర్లలో నాలుగయిదు యెవళ్ళూ చూడకుండా యెగకట్టిన పొత్తి పంచలో దాచేసి యింటికి వెళ్ళాక మా మామ్మకిచ్చేవాడ్ని"

"ఆ దొంగచాటు బుద్ధులు మాకు తెలవ్వు బాబూ!...పైగా ఆవిడ దగ్గర కూర్చుని తినిపిస్తుంటేను!"

"దొంగబుద్ధి కాదు లీలా! అభిమానం అలా చేయించింది... ఎప్పుడయినా హోటల్లో ఫ్రెండ్స్ ఒత్తిడితోనూ, మరి యేదయినా పార్టీలోనో లడ్డూలు గులాబ్‌జాంలు తినవలసి వస్తుందనుకో, తినడానికి ప్రారంభించగానే నువ్వూ బాబిగాడు వెంటనే గుర్తుకు వస్తారు. నే నక్కడ యేం తిన్నానో, అవి కొని రాత్రికి యింటికి తెస్తాను.'

"మీరు మంచివారు, సరేనా?"

నే నొకసారి కాలరు ఎత్తుకుని అదోలా చూస్తూ లీల చెక్కిలి మీద చిటికవేసి 'నువ్విలా అంటే మరి నాకు ఆపాదమస్తకం కితకితలు పెట్టినట్లయి పోతూంది అదేమిటో!... సరే కానియ్ పిన్నిగారు యింకేం చేశారుట?' అడిగాను.

'నేనేం చెప్పను పొండి, మీకంతా వేళాకోళంగా వుంది' అది బుంగమూతి పెట్టి.

చక్రాల్లాంటి ఆమె కళ్ళు స్థిరంగా ఉండక చంచలాలు అయ్యాయి. పాల మీగడ లాంటి చెక్కిళ్ళు ఉత్తినె లేత గులాబీ రంగును పోసుకున్నట్లున్నాయి. ఫాను గాలికి నుదురు పై పడుతున్న ముంగురులు అల్లాల్లాడుతూ వింత సోయగాన్ని సంతరించి పెడుతున్నాయి. ఆ క్షణం సేపటి నిశ్శబ్దంలో తన్మయత్వంలో ఆమెను చూస్తున్న నాకు ఆమె మా ఆవిడేనా అనిపించింది!

'ఏమిటలా చూస్తున్నారు?' లీలగా ప్రశ్నించింది.

'చూస్తున్నాను, ఏదో కొత్తదనం...ఇది వరలో యెప్పుడూ చూడని కొత్త అందాలు చూస్తున్నాను.'

'ప్రపంచంలో మీ ఆవిడ ఒక్కర్తే అందమయినదన్నట్లు మాట్లాడుతారు మీరు!'

'అబద్ధం కాదు లీలా! నా కళ్ళను నే నే నమ్మలేక పోతున్నాను. యివాళ నువ్వేదో వింత వింతగా కనిపిస్తున్నావు, పాలరాయిలా, పుచ్చ పువ్వులాంటి పండు వెన్నెలా...'

'మొదటినుండీ నా తెలుపు రంగంటే మీకు అసూయే! యిదివరకటి రంగు యిప్పుడేదీ, మీ నలుపు రంగు నాకు అంటుకుంది.. మీరు చూస్తే యిది వరకటంత నల్లగా కాక రంగు వచ్చినట్లున్నారు...అవునూ, బాబయ్యగారికి రెంట్ యిచ్చెయ్యక పోయారా?'

'ఇవాళేగా జీతాలు తీసుకుంట, రేపు యిస్తానులే.'

'పాపం, బాబయ్యగారూ మంచివారేనండి, పిన్నిగారితోపాటు నాకూ పువ్వులు తెచ్చి పెట్టారు; డబ్బులివ్వబోతే తీసుకోలేదు ... మీ కూరగాయలు తేడం డ్యూటీ కూడ యీ మధ్య ఆయనకే ట్రాన్స్‌ఫర్ చేసారాయె!"

ఇలా అంటూ వచ్చింది లీల మొదట్లో. అక్కడికీ నేనొకసారి అనేసాను 'చూడు లీలా! పరిచయం చేసుకోడం చాలా సులువు. అది నిలబెట్టుకోడమే గొప్పతనం ... ఎందులోనూ అతి పనికిరాదన్నారు ... రిలేషన్సు చెడకుండా చూసుకోడం నీ వంతు' అని.

'ఏమిటి అతి చేసానుట? ఎవరితోటీ మాట్లాడకుండా యీ నాలుగు గోడలమధ్య మూతి మూసుకుని ముంగిలాపడి ఉండమనా మీ ఉద్దేశ్యం?' అంది అతిశయంతో.

'అనవసరంగా ఆవేశం తెచ్చుకోకు, చెప్పేది స్థిమితంగా విను ... నీ కెందుకు శ్రమ అంటూ గుమ్మం ముందు కళ్ళాపిచల్లి ముగ్గులు వెయ్యడం ఆవిడే చేస్తుందంటున్నావు. ఇది ఒకరోజు ఆవిడ, యింకోరోజు నువ్వుచేస్తే పోతుందిగా! ... మన కాగులో వేరే నీళ్ళు కాచుకోడం మంచిదంటున్నాను. అసలు నువ్వు మరీ పొద్దుపోయి లేవడంవల్ల వస్తూంది యీ తంటా!'

'ఆవిడకిలేని నొప్పి మధ్యన మీ కెందుకని? మీరే నన్నిలా ఆడిపోసుకుని యెవటివాళ్ళకు నేర్పిపెట్టిన వాళ్ళవుతున్నారు!'

"కాస్త మెల్లిగా మాట్లాడుదూ! ... నిన్ను ఆడిపోసుకోడం నాకేమన్నా సరదానా? నీ మంచి కోసం చెప్తే నువ్వు ఊరికే విపరీతార్థాలు తీసుకుని యిదవుతున్నావు'

అభిమానంతో యించు మించు కన్నీళ్ళ పర్యంతం అయి "ఆలస్యంగా లేస్తున్నాననడం నా మంచికోసమా, వేన్నీళ్ళు వేరే కాచుకో మనడం, వీధిలో పాచివెయ్యమనడం నామంచి కోసమా? ఏది నామంచికోసం?... అసలే ఆడవాళ్ళ విషయంలో జోక్యం కలిగించుకుని నా బుర పాడుచెయ్యకపోతేనేం!" అంది.

లీలను అర్థం చేసుకుని అభిమానించి

## మీకు తెలుసా?

## ఉడతలు పండ్లు కొట్టకుండా నివారించే సాధనం

ఉడతలు, పక్షులు చెట్లమీద పండ్లు కొరికేస్తుండటం చికాకు కలిగించే విషయం. దీన్ని నివారించటానికి అమెరికాలో ఒక ఉపాయం కనిపెట్టారు. చెట్ల బోదెలకు, కొమ్మలకు - ఒక అల్యూమినమ్ రేకు అతికిస్తారు. ఈ రేకులపై సన్నని సూదులు ఉంటాయి. పాములు, ఎలుకలు సైతం ఈ ముళ్ళ రేకులను దాటి వెళ్ళటానికి సాహసించలేవు. ఈ సాధనం పేరు జెష్నర్. దీన్ని చెట్టు మొదలు చుట్టూ అమర్చటానికి మేకులు కొట్టవలసిన పని లేదు. దానంతట అదే చెట్టు మొదలును కరచుకొంటుంది. ఫిలడెల్ఫియా (పెన్సిల్వేనియా రాష్ట్రం) లోని జాక్ మెయర్స్ కంపెనీ ఈ సాధనాన్ని రూపొందించింది.

ప్రేమను పంచియివ్వాలని నా తాపత్రయం. ఆమె అమాయకత్వానికి ఒక్కొక్కప్పుడు యేడవాలో నవ్వాలో తెలియని స్థితి వస్తుంది నాకు. ఇంకోయింటినుంచివచ్చి నా భార్య అయింది. ఆమెతల్లి తండ్రులు నేర్పనిది నేను నేర్పాలి. నేను తెలిసికోవలసిందుంటే ఆమె నుంచి వినడానికి సన్నద్ధుడనవాలి. ఆమె నాకు బానిస యేంకాదు. అలాఅని ఒకళ్ళ మాట మరొకరు విని ఆదరించినంత మాత్రాన బానిసలేం అయిపోరు. రుచులు ఆమె నాకు తినిపిస్తే, ఆమె అభిరుచులను తీర్చవలసిన బాధ్యత నాపై ఉంది. ఆమె మూర్ఖత్వం అవలంబిస్తూందని నేను పశువులా మారితే యింకేంవుంది! పైగా, మనిషిని కొట్టితిట్టి మార్చలేం అన్నది వ్యక్తిగతః అనుభవ మయినదే! అందుకని అలాటి పరిస్థితే వస్తే సాధారణంగా మౌనం వహించి ఊరుకుంటాను. ఆతరువాత ఆమెను కవ్వించి మురిపించి అక్కున చేర్చుకుంటాను.

ఇవాళ తెలిసి వచ్చింది మూర్తి చెప్పిన మాటలు ఆనాడు యెందుకు విన్నాను కాదా అనిపిస్తూంది యిప్పుడు. కాని యిది యిలా యెందుకయిందనే ఆశ్చర్యంగా ఉంది. సెలు వంటిది వచ్చినా ఆపగలనుకున్నాను ఆరోజు.

నాలుగు రోజుల క్రితమే ఆ ఉదయం భోంచేసి ఆఫీసుకు బయల్దేరుతుంటే తన చొక్కాకాలరు సవరిస్తూ "సాయంకాలం ఫస్ట్‌షో సినిమాకి వెళతానండి!" అంది లీల

"వెళతావా?...మరినేనో?"

"నేను ఒక్కర్తెనూకాదు పిన్నిగారూ నేనూ.పౌరాణిక మంటే ఆవిడా వస్తా నన్నారు"

# ఇంటావిడ-మా ఆవిడ

'బాబయ్యగారు వస్తే అందరం పోవచ్చుగ!'

'ఉహూం. ఆయన సినిమాలు చూడరుట. ప్లీజ్! మీరు కాస్త అయిదు గంటలకే వస్తే, బాబిగాడ్ని తీసుకుని అలా బజారు తిప్పి తీసుకువచ్చి ఆ తరువాత అన్నం పెట్టి పడుకోపెట్టవచ్చని.'

'నువ్వు సినిమాకి దర్జాగా ఉడాయించడమూ, నేను బాబిగాడ్ని సముదాయించడమూనా! నీకేం పిచ్చి పట్టలేదు కదా? నో, నో! నా వల్లకాదు...వాడ్ని కూడా తీసుకెళ్ళు, నేనూ యింకో సినిమాకి పోయి వస్తాను.'

'వాడు నన్ను సినిమా చూడనివ్వడండీ బాబు, మీరు యెరగనిది కాదు...అసలు పిన్నిగారూ సినిమా మాని నాలుగేళ్లయిందట, నేనే బలవంతం చేస్తే.'

'సరే ఒక షరతు!... మళ్ళీ యిటువంటి ప్రోగ్రామ్ యీ జన్మకి పెట్టనని మాట యిస్తేనే.' అంటూ చెయ్యి చాచాను.

'అలాగే' అంటూ చేతిలో చెయ్యి వేసింది. 'మీ రెంత మంచివారండీ!' అంటూ చెయ్యి వెనక్కి తీసుకుని ముద్దు పెట్టుకుంది.

'ఆఁ, ఆఁ! ఇక రోజూ వంట కూడ చేసి పెడితే మహా మంచివాడ నవుతానేమో!' పది రూపాయల నోటు ఆమె చేతిలో ఉంచి ఆదోలా చూసాను.

'వెళ్ళండి!' అంటూ సిగ్గుపడి పోయింది.

పిన్నిగారంటే అంత అభిమానం చూపిన లీల ఒక్కసారిగా ఇలా అయిపోయిందేమిటని!

పాపం, ఏడ్చిఏడ్చి మంచంమీద వాలిపోయింది. ఇటు యీ మంచంమీద పడుకున్న బాబిగాడి మొహంమీద నా దృష్టి పడింది. ఈ గొడవ లన్నిటికీ అతీతంగా ప్రశాంతంగా పడుకుని ఉన్నాడు. వాళ్ళ అమ్మ, నేనూ పడిన ఘర్షణ దానికి కారణాలు వాడికి తెలియవు మరి!

ఈ అయిదేళ్ళ వైవాహిక జీవితంలో యివాళ మొట్టమొదటిసారిగా లీల మీద చెయ్యి చేసుకున్నాను. అక్కడకూ నేను హెచ్చరిస్తూ వచ్చినా తన బాణీని తను మార్చుకుంది కాదు. ఇవాళ యింటికి రాగానే అర్ధాంతరంగా యింటావిడ తనను వీధిన పెట్టిందంటూ జేవురించిన మొహంతో 'బరస్ట్' అవుతూ చెప్పింది.

"ఆ ఏడుపు మాని జరిగిందేమిటో చెప్పు!" ఆ కట్టుగుడ్డలతోనే మంచం మీద కూలబడిపోయాను.

మామూలు అవస్థకు రావడానికి కొంచెం సేపు పట్టింది.

'నేను యెడ్డిమనిషినిట; ముట్టుగుడ్డలు, మైలగుడ్డలు యింట్లో కలుపుకుంటానట; నేను మిమ్మల్ని బుట్టలోపెట్టి ఆడిస్తున్నానుట!'

'ఆవిడే అన్నారా?'

'ఆఁ. నా కాళ్ళు క్షణకాలం కూడ నిలవవుట: మీరలా ఆఫీసుకు వెళ్ళగానే యిలా ప్రయేపేరంటాలకో సినిమాలకో పోతానుట!'

'వెదుతున్నానేమో!'

'మీరు వెక్కిరింత చెయ్యకండి, నాకు వళ్ళు మండుకొస్తూంది!.. వెడితే వెడతాను నా యిష్టం. నా మీద అజమాయిషీ చెయ్యటానికి ఆవిడెవ్వరని? ... ఇంకా వినండి, మీ జీతం చాలీ చాలనిదయితే మనలేమిని చూడలేక అడపాతడపా వాళ్ళు డబ్బు రూపంలోనో, వస్తురూపంలోనో ఉదారంగా యిచ్చి ఆదుకుంటున్నారట!'

"అలా అన్నారా? ... నువ్వెప్పుడయినా డబ్బు అప్పు తీసుకున్నావా?"

"ఒక సారెప్పుడో ముష్టి అయిదు రూపాయలిచ్చారులెండి, అది యెప్పుడో యిచ్చెయ్యడమూ అయింది... అంతేకాదు. యిది వినండి! నేను నీళ్ళు పోసుకోకుండానే వంటచేస్తానుట, పిల్లాడ్ని వాళ్ళింట్లో వదిలేసి వళ్ళుమఱచి కథలు చదువుకుంటూ కూర్చుంటానుట!"

"నేనున్నప్పుడే నా ఉనికి గమనించకుండా చదువు తుంటావులే, తరువాత?"



"తమాషాగా ఉంది మీకు చూడగా! ... ఎదటి వాళ్ళు యెంత పెద్ద వాళ్లయినా వాళ్ళ ముందుకూడానన్ను చులకన చెయ్యడమే మీకు సరదా. అవున్లేండి, అసలు నేనంటే మీకు యేకోశానయినా జాలి పేగూ ఉంటేగా?

అంటుంటేనే లీల కనుకొనల్లో నీళ్ళు నిలిచాయి.

"అభిమానం ఉందో లేదో తరువాత చర్చిద్దాంలే!...నిన్నమొన్నటి దాక పిన్నిగారి మంచితనం గురించి రోజుకో గంటయినా లెక్చరిచ్చిన నీకూ ఆవిడకూ మధ్య యింత హఠాత్తుగా యీ రగడెందుకు జరిగిందని?"

చీరచెంగుతో కన్నీళ్ళు తుడిచేసుకుని "నేనూ రక్త మాంసాలున్న మనిషిని, చచ్చుపడియేం ఉండలేదు... ఈవిడ నిజరూపం చూడగానే పట్టుకుని దులిపేసాను, ఇల్లు

## ఇంటావిడ–మా ఆవిడ

ఉట్టినే యివ్వలేదు,అద్దెకు యిచ్చారు'' అంది ఉక్రోషంతో.

నేను మాట్లాడలేకపోయాను కొద్ది సేపు. తరువాత మందలింపు ధోరణిలో యిలా అన్నాను "గొడవ యెందుకు నువ్వుకాస్త గౌరవం ఉంచవలసింది''

కోపంతో కస్సుమంది "ఇంతలేసి మాటలు విన్నాకకూడ గౌరవం ఉంచాల్సిందని యే మొహంతో అంటున్నారని? మీ మంచితనానికో నమస్కారం,ఇంట్లో వాళ్ల మర్యాద వెలబెట్టి బాముకునే మంచి యేం మంచండి?...ఛీ ఛీ: ఇది మంచి తనం కాదండీ! అసమర్థత బల హీనత!''

'లీలా! నీకు మతి పోయిందా?' ఆవేశంతో అరిచాను అహం దెబ్బ తినడంతో.

'ఆఁ. పోయిందండీ!...మీకు చెప్పి ఓదార్పు పొందకపోగా, అవమానించబడి నా మతి పోయింది అయినా నా వెర్రి కాకపోతే, మీ తత్వం యెరుగుండీ కూడ నా గోడంతా మీకు చెప్పకోడ మేమిటి! ఇదంతా నా కర్మ, సాటి ఆడవాళ్లంతా మగవాడి నీడలో నిశ్చిం తతో హాయిగా మనగలుగు తున్నారు. అభి మాన మంటూ వున్న మగవారేనా మీరని?'

'నోర్ముయ్!' ఇంక సహించలేక చెంప పెట్టు పెట్టాను.

ఎక్కెక్కి యేడుస్తూ జేవురించిన మొహంతో ఆగి ఆగి అంది.

'మీరు మగ మహారాజులు! ఎదటి వాళ్లని ఏం అనలేక... పెళ్లాన్ని కదా... అందుకని... హక్కు వుందని కొడతారు లేండి!... అది ప్రతిభ మరి!...ఏమిటో అనుకుంటున్నారు, నా నోరు ముయ్యగలగడం ప్రజ్ఞం కాదు' మడత మంచంమీద వాలిపోయి తలగడాలో తలదూర్చి చాలసేపటి దాకా యేడుస్తూనే ఉంది.

తీరా కొట్టేసాక నాకు బాధ వేసింది... ఇందులో లీల దోషం యేముందని! ఇంటావిడ ఉప్పనీ లేనిపీ కల్పించి యిన్ని మాట లనాల్సిన అగత్య మేమొచ్చిందని!కన్నకూతురు లాంటి దానవు అని ఆవిడ లీలను అనడం ఒకటి రెండుసార్లు నా చెవినీ పడింది. ఆ చూపించిన ఔదార్యమంతా ఒట్టి నటనేనా!

'చిన్నవాడవు. నువ్వేం చెయ్యి కాల్చు కుంటావులే' అంటూ లీల వంట చెయ్యలేక పోయిన సమయాల్లో వండి పెట్టిన ఆవిడేనా తమ నింత దారుణంగా తీసి పారేసింది! మూర్తి అననే అన్నాడు ఆ నటన వెనక కుళ్ళు యెంతయినా ఉందని!

లీల నిద్రపోయింది సందేహంలేదు. లేచి ఆమె మంచం దగ్గఱగా వచ్చాను. ప్రేమగా జుట్టు సవరించాను. చాలసేపు ఆమె మొహం లోకి చూస్తూ అలాగే నిల్చునిపోయాను. ఇద్దరం భోజనాలు కూడ చెయ్యలేదు. ఆమెను లేపడం యిష్టంలేక యింక బట్టలు మార్చుకుని బాబిగాడి పక్కన పడుకున్నాను.

ఎందుకో చటుక్కున అయిదుగంటలకు మెలకువవచ్చి చూస్తే మంచం మీద లీల లేదు. కంగారుపడి వీధి తలుపులు తెరిచి ఉంటే చూస్తిని కదా అక్కడ వీధి పాచి చేస్తూ కనిపించింది. నా మటుక్కి నాకు ఆశ్చర్యంవేసింది. తిరిగివచ్చి ముసుగుతన్ని పడుకున్నాను. నిద్ర పట్టిందికాదు. అటూ యిటూ దొర్లి ఆరు కాకుండానే నేనూ లేచి కూర్చున్నాను. ఆ రోజు నీళ్ళు సొసీద కాచింది లీల.

నాలుగురోజులు పోయాక రెండవతారీఖున యథాప్రకారంగా యింటాయన సీతారామయ్య గారికి అద్దెయివ్వటానికి ఉదయమే కాఫీ త్రాగాక వెళ్ళాను.

మంచంమీద పిన్నిగారు పడుకుని ఉన్నారు. సీతారామయ్యగారు యెదురుగా కుర్చీలో కూర్చుని ఉన్నారు.

'అలా పడుకున్నారేం ?' అడిగాను.

'నిన్నటి నుంచి జ్వరం, దగ్గు, ఆయా సంతో మంచం పట్టింది ... ఆ స్టూల్ లాక్కుని కూర్చో'

'అరె, నాకు తెలియనే తెలియదే! మరి డాక్టరుగారు వచ్చారా ?'' స్టూల్ మీద కూర్చుంటూ అడిగాను.

'ఏదో నాకు తెలిసిన హోమియో మందులే వాడుతున్నాను.'

'ఆవిడ చెయ్యిపట్టుకుని చూచాను 'వళ్ళు కాలిపోతూందండీ! నేను డాక్టర్ని తీసుకు వస్తాను' అంటూ లేవబోగా యింటావిడ వారిస్తూ 'ఎందుకు నాయనా! అదే తగ్గి పోతుందిలే, ఇలా నాకు అప్పుడప్పుడు రావడమూ ఉంది. వారిచ్చే మందులతో తగ్గడమూ ఉంది' అన్నారు.

"మరి నిన్నటినుంచి ఆహారమే మయినా తీసుకున్నారా లేదా?''

# వంటలు

## అరటికాయ పాతోళి

కావలసిన వస్తువులు :— అరటి కాయలు, అల్లం, వుప్పు, వుల్లిపాయ, పచ్చిమిర్చి, నూనె, పోపు దినుసులు.

తయారుచేయు విధము :— అరటి కాయలను రెండు లేక మూడు ముక్కలుగా తరిగి నీటిలో బాగా వుడకనిచ్చి పెచ్చు తీసేయాలి. పెచ్చు తీసిన ముక్కలను రోట్లోవేసి కొంచెం ఉప్పు, అల్లం వేసి మెత్తగా అట్లు వేసుకునే లాగ రుబ్బాలి. ఆ రుబ్బిన పిండిని పెనంమీద అట్లుగావేసి, వాటిని చిన్న చిన్న ముక్కలుగా తుంచిపెట్టాలి. ఉల్లిపాయ, పచ్చిమిర్చి సన్నగా తరిగి పెట్టాలి. పొయ్యిమీద బాణలిలో కొద్దిగా నూనెపోసి కాగాక పోపు దినుసులు, పచ్చిమిర్చి, వుల్లిపాయ వేసి వేపాలి తర్వాత తుంచిన ముక్కలను వేసి వేపాలి. ముక్కలకు పోపు అంటుకున్నాక దించేసి తగినంత నిమ్మరసం పిండి కలపాలి.

— గార్ల సరస్వతి.

## షుపుణో

బెల్లం నీళ్లలో నానవేసి ఆ నీళ్ళు గోధుమపిండిలో కలపాలి. ఈ పిండి జారుగా అట్లపిండి మాదిరి కలుపుకోవాలి. తరువాత పెనం కాలేసి ఈ పిండి పెనం మీద దోసెలులాగా పొయ్యాలి. ఈ వంటకాన్ని ముఖ్యంగా పిల్లలు ఇష్టపడ్తారు. దీనికి కొలతలు రాయలేదు. అవి మీ రుచినిబట్టి ఎక్కువ తక్కువ వేసుకోవచ్చు ఎప్పుడుదోసెలు, ఇడ్లీలే కాకుండ మధ్యాన్నం టిఫిన్‌లో ఇవికూడ చేరుస్తే బాగుంటుంది.

—శ్రీమతి విజయాప్రసాద్

"లంఖణంప రమౌషధంకదా! ఆహారమిస్తే యెలా? కాఫీచుక్కలు మాత్రం ఒకటి రెండు సార్లు త్రాగుతూందంతే!" అన్నారు సీతారామయ్యగారు :

ఆవిడేమో చూస్తే జ్వరతీవ్రతలో యెలా పడితే అలా ఉంది. వాళ్ళ పూర్వోత్తరపు ఛాందసాలకు యేడవాలో నవ్వాలో తెలియలేదు. ఇలాగే గడిపేసి ఉంటాడు మరి యీ జీవితపు చరమావస్థవరకు.

"ముందు యీ యింటి అద్దెడబ్బు తీసుకోండి... నాకెందుకో డాక్టర్ని తీసుకురాడం అవసరమనిపిస్తూంది. నన్ను వారించకండి" అనేసి యింటాయన యేదో అనబోతున్నా వినిపించుకోక వెళ్ళిపోయాను.

డాక్టర్ని తీసుకు వచ్చి చూపించాను. ఇంజక్షన్స్, టాబ్లెట్లు తీసుకువచ్చాను. డాక్టర్ యింజక్షన్ చేసి టాబ్లెట్లు యెలావాడాలో చెప్పి, ఆహారం విషయంలో కూడా సూచనలిచ్చి వెళ్ళారు.

ఆ ఉదయం భోజనం చేస్తూ "పిన్నిగారికి జ్వరం, నీకు తెలియదా?" అడిగాను లీలని.

"తెలుసు" అంది ముక్తసరిగా.

"మరినాకు చెప్పలేదేం?"

"చెప్ప వలసినంత అగత్యం కనిపించక. అయినా ఆవిడకు జ్వరం వస్తే మధ్యలో మీకెందుకు పట్టాలిట?"

ఆమె మాటల తరహాకు నొచ్చుకున్నాను. అయినాతమాయించుకుని "మనం మనుష్యులం లీలా! బండరాళ్లం మాత్రం కాము. పాత వైరాలను పురస్కరించుకుని పగ తీర్చుకోడం మహార్క్షుల లక్షణం. ఆవిడ పరిస్థితేంబాపు లేదు. నామాటవిని ఒక్కసారి చూసిరా!" అన్నాను మందలింపు క్షమ మిళితమయిన స్వరంతో.

'మీకు మంచి అనిపిస్తే వెళ్ళండి, ఊడిగం చెయ్యండి! ... నాలో అంత మంచితనంలేదు. అందరినీ నావాళ్ళు అనుకుని అహం చంపుకుని సేవలుచేసే గొప్పతనం నాలోలేదు ... అవ్వ! ఆవిడెవరికో జ్వరం రావడమేమిటి, నన్ను యిక్కడ కన్నీళ్ళు కార్చమనడమేమిటని? ... దయచేసి మీకు దండం పెడతాను గాని, మీ భావాలు నా మీద బలవంతంగా పులమాలని ప్రయత్నించకండి!' అనేసింది కుండను భళ్ళుమని పించినట్లు నిష్కర్షగా.

ఒక్కక్షణం లీలను అదోలా చూస్తూ ఉండిపోయిన నేను మామూలు స్థితికి రావడానికి ప్రయత్నించి అన్నం తినడంలో నిమగ్నుడ నయ్యాను.

మజ్జిగ అన్నం కలుపుకుంటూ 'సీతారామయ్యగారితో నీకు పేచీ జగరలేదు కదా! పోనీ ఆయనకు ఆవిడ కోలుకునేదాక అన్నం వండి పెట లేవా?' అడిగాను అర్థింపు ధోరణిలో.

'ఆయన వచ్చి మీతోపాటు తింటే నాకు అభ్యంతరంలేదు. తీరా తినేసి యిలాఉంది, అలాఉంది అంటూ దీర్ఘాలు తీస్తే మాత్రం నేను సహించలేను. ముందే చెప్తున్నాను" అంది నిర్మొహమాటంగా.



'దానికేనా ఒప్పుకున్నావు థాంక్స్' అన్నాను యెవరో పైవాళ్లకు చెప్పుకొన్నట్లుగా.

వారంరోజులు తక్కువపట్టలేదు యింటావిడకు జ్వరం తగ్గటానికి. ఆవిడ పూర్తిగా కోలుకుని మామూలుగా తిరగటానికి యింకో పదిరోజులు పట్టవచ్చు.

ఆరోజు సాయంకాలం ఆఫీసు నుంచి యింటికి వస్తూంటే అనుకోకుండా తోవలో మూర్తి కలిసాడు. ఆ కబురూ యీ కబురూ ముచ్చటించాక మూర్తి అడిగాడు 'అన్నట్లు ఆ యింట్లో యెలా ఉంది? ఏ గొడవ లేకుండా సాగిపోతున్నట్టేనా ?,

'ఆఁ' అంటూ బుర్ర ఊపాను యాంత్రికంగా. గొడవలన్నీ చెప్పటానికి మనస్కరించలేదు. పైగా యీసారి వాడి ప్రశ్న నా అహాన్నిదో దెబ్బ తీసినట్లయింది. నా మొహంలో భావాలు యెక్కడ చదివేస్తాడో అన్నట్లుగా అధోముఖుడనయి మరీ నడుస్తున్నాను.

వాడు ఉద్రిక్తుడు, అనసే అనేసాడు 'లేదు, నువ్వేదో దాస్తున్నట్టే ఉంది. ఆఁ బైదిబై, మా యింటి పక్క పోర్షన్ ఖాళీ

## ఇంట్లావిడ-నా ఆవిడ

అయింది. అది ఆ బాంకు గుమాస్తా ఉంటున్నది. నీకు యిష్టం అనిపిస్తే అందులోకి మారిపోవచ్చును. ఆలోచించు, మీ ఆవిడతో. నేనేమో అనుమానం 'టూర్' లో ఉంటానుగా! మా ఆవిడ కూడ మీరు అక్కడ ఉంటే బావుంటుందని అభిప్రాయ పడుతూంది.'

అసలు లీల యీ మధ్య చాలాసార్లు యిళ్లు మార్చివేదామంటూ వస్తూంది. మూర్తి యీ మాటలకు ఆలోచనలో పడ్డాడు. వాడు నాకు స్నేహితుడు. వాళ్ళ యింటి ప్రక్కనే ఉండటం యెంత వరకు సమంజసం? టీ త్రాగడం అయ్యాక మూర్తి వెళ్లిపోయాడు. నేను యింటి ముఖం పట్టాను.

విరిగిపోయిన మనస్సులతో యీ ఆడవాళ్ళు యిద్దరు పక్క పక్కన ఉండటం యెప్పుడూ యేదో గొడవకే అవుతుందనిపించింది. రాత్రి మూర్తి చెప్పిన పోర్షన్ గురించి లీలతో చెప్పగా యెగిరి గంతేసింది.

'ఆ పోర్షన్ నేను చూసానండీ, చాల బావుంటుంది.'

మర్నాడు మూర్తి యింటికి వెళ్లి పోర్షన్ మా కోసం సెటిల్ చేసుకుని వచ్చాను.

సామానంతా ముందు వెళ్లి పోయింది. ఇంక నేను, లీల, బాబిగాడు రిక్షాలో వెళ్లడమే తరువాయి.

'లీలా' వెళ్లి బాబయ్యగారికి, పిన్నిగారికి చెప్పి రిక్షా ఎక్కు.'

'బాబయ్యగారికి చెప్పాను, ఆవిడకు చెప్పను' అంటూ వీధిలోకి నడిచింది.

లీలలోని యీ పంతం నాకు బాధను రేపినదే అయింది.

నేను బాబిగాడ్ని యెత్తుకుని వీధి అరుగు మీదకు వచ్చేసరికి లీల రిక్షాలో కూర్చుని ఉంది.

మొహంలోకి ప్రసన్నతను తెచ్చుకుంటూ "వెళ్లి వస్తామండి!" అన్నాను సీతారామయ్యగారితో.

"ఒకసారి లోపలికి రా బాబూ! "అన్నారు పిన్నిగారు లోపలనుంచి

పసుపు కోరుపెట్టిన లాగు గుడ్డ, చొక్కాగుడ్డ; బిస్కెట్ పేకెట్ బాబిగాడిచేతుల్లో ఉంచి కంట తడి పెట్టుకుంటూ 'నాజ్వరంలో మాకు చేసిన సేవ జన్మజన్మలకు మర్చిపోలేం....నేను ఏ పాపం యెరగను నాయనా! మాయిద్దరి సఖ్యతచూసి కళ్లుకుట్టి పక్కింటి వర్ధనమ్మ మీ ఆవిడ మనసు విరిచింది" అంటూ ఆగని దుఃఖంతో వలవలా యేడ్చింది.

త్రుటికాలం ఆశ్చర్యానికి లోనయాను... లోపం యెవ్వరిలో ఉందో బుర్రకందని తికమకలో పడ్డాను."ఊరుకోండి!...మా అజ్ఞానాలకు మమ్మల్ని మాతృవాల్ని క్షమించండి!"

ఎవరి తప్పులెలా ఉన్నా ఆ సమయంలో ఆ స్థితిలో ఆ ముసలి ప్రాణాలను చూడలేక నాకూ కళ్లు చెమ్మగిలగా "వస్తా మండి!" అనేసి వీధిలోకి వచ్చి రిక్షాకేసి నడిచాను అయోమయంగా!!!



హౌరా ఢిల్లీ మధ్యగల 1441 కి.మీ. రైలు మార్గాన్ని ... గంటకు 160 కి.మీ. వేగంతో ... —(ప్రెస్ ఫోటో)

# నవ్వుల రుచుల రాజ్యం



# బ్రిటానియా

## బ్రిటా హై కౌంట్ బిస్కట్లు

## కేవలం రూ. 1/-కి బోలెడన్ని

బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్.BBC.24-140 TL

# డాక్టర్ సలహాలు

**ఎస్. ఎ. — భీమవరం**

నా వయస్సు 27 సం.లు. దాదాపు 10 సం.లుగా ముక్కులోనుంచి ఆదేపనిగా ఒకేసారిగా 10, 12 తుమ్ములురావటం నీళ్ళు కారటం జరుగుతుంది శీతాకాలం, వర్షాకాలాలలో అతిగా ఈ తుమ్ములు వస్తాయి. అలాగే మా బాబుకి కూడా (4 సం వయస్సు) నెలకొకసారి జలుబు, దగ్గు, ఆయాసం వచ్చి 3 రోజులపాటు ఉండటం, ఆ మామూలురోజులు మంచినీరు ఎక్కువగా త్రాగుతాడు. ఇవి తగ్గే మార్గం చెప్పండి.

మీరు వ్రాసిన విషయాలను నిశితంగా పరిశీలిస్తే మీకే సమాధానం తెలుస్తుంది. మీకు కొన్నికారణాలవల్ల శరీరంలో ఏర్పడే "ఎలర్జీ"అనేది మీ బాబుకు కూడా సంక్రమించటంలో ఆశ్చర్యం లేదు. శరీరానికి పడని పదార్థాలను కనుగొనటం కష్టతరమే అయినా వాటిని కనుగొని దూరంగా వాటిని ఉంచటం ఉత్తమం.

**కె. డి. — అనకాపల్లి**

నాకు బాబు పుట్టిన 3వ నెలలో మొదటిసారి ఋతుక్రమం వచ్చింది. తర్వాతి ఋతుక్రమం ఒక వారం ఆలస్యం అయి, ఒక్క రోజే మాత్రమే రక్తస్రావం జరిగింది. ఇది ఏమైనా అపాయకరమైనదేనా? ఏమైనా జాగ్రత్తలు తీసుకోవలసి వుందా?

ప్రసవించిన తర్వాత వచ్చే ఋతుక్రమాలు క్రమంతప్పి వస్తూ ఉండటం, రక్తస్రావం ఎక్కువ తక్కువలుగా ఉండటం చాలాసాధారణం. దీనివల్ల అపాయమేమీ లేదు. కాని, ప్రసవానంతరం ఋతుక్రమాలు మొదలైన తర్వాత ఆగిపోతూ, మరలా వస్తూవుంటే, మరలా గర్భం వచ్చినదీ లేనిదీ తెలుసుకోవటం కష్టతరం. అలా తెలుసుకోవాలనే ఆరాటం కలగటం మాత్రం నిశ్చయం. ముందు జాగ్రత్తలంటూ ప్రత్యేకించి ఏమీ లేవు.

**జి. ఎస్. హైదరాబాదు**

నా వయస్సు 20 సంవత్సరాలు వివాహమయి 2 సంవత్సరాలు అయింది. మొదటిసారి గర్భం "అబార్షన్" అయి, రెండవసారి అయిన పాప పుట్టి 4 వ రోజున ఫిట్సు వచ్చి శరీరం పసుపుగా మారి చనిపోయింది. పుట్టగానే ఏడవలేదు ఇలాగే ఇంకా పుట్టబోయే శిశువుకు కూడా ఏర్పడే ప్రమాదము ఉన్నాదా ?

మీ పాప చనిపోవడానికి కారణం ప్రసవ సమయంలో జరిగిన ఆలశ్యం అని చెప్పవలసి ఉన్నది ఆ ఆలశ్యంవల్ల మెదడులోని జీవాంశాలు (సెల్స్) ప్రాణంలేనివిగా ఉండటంవల్ల ఫిట్సు రావటం జరిగింది, ఫిట్సు రావటంవల్ల ఊపిరాడక శరీరం పసుపు నీలం కలసిన రంగుగా మారుతుంది. పుట్టగానే ఏడవలేదనేది పై వాదాన్ని పటిష్టం చేస్తున్నది. మంచి శ్రద్ధతీసుకో

# మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం
# మీ పైర్లకు అవసరం విజయ్

పిల్లలు ఆరోగ్యంగా వుండాలంటే పుష్టికరమైన ఆహారాన్నివ్వాలి. అట్లాగే పైరు మొక్కలకు నత్రజని, భాస్వరం, పొటాష్‌లతో కూడిన పోషక పదార్థాలు అందజేయాలి. అప్పుడే పంటదిగుబడులు బాగుంటాయి, రాలుబడి ఎక్కువౌతుందికూడా.

ప్రస్తుతం ఎరువుల ధరలు పెరిగిపోయిన మాట వాస్తవమే. అందుచేత ఖర్చులు తగ్గించుకోడానికి వరిపైరుకు యూరియా మాత్రమేవేస్తే సరిపోదాఅని మీలో కొందరు అనుకోవచ్చు. కాని యూరియా మాత్రమే వేస్తే...వరి మొక్కలలో చీడలు, తెగుళ్ళ నిరోధక శక్తి తగ్గిపోతుంది. అంతేకాదు పైరు నేలకి ఎద్దడిని తట్టుకునే శక్తినికూడా కోల్పోతుంది. భూసారం కూడా క్రమేణా తగ్గి పంటదిగుబడులు క్షీణించిపోతాయి.

భాస్వరం, పొటాష్‌లు వాడినపుడే మొక్కలు నత్రజనిని గ్రహించుకోగలుగుతాయి. ఈ మూడు పోషక పదార్థాలు వాడితే పైరు మొక్కలు బాగా ఎదిగి, అధికరాలుబడి, అధిక లాభాలు వస్తాయి. ఈ విషయాన్ని ఋజువుచేసిన పరిశోధనా ఫలితాలను పరిశీలించండి.

## వరిపంట

| వేసిన పోషక పదార్థాలు | ఎకరాకు దిగుబడి (75 కిలోల బస్తాలు) | ఎకరాకయ్యే సాగుబడి ఖర్చు రూ. | ఎకరాకు రాబడి రూ. |
|---|---|---|---|
| 50 కిలోల నత్రజని | 20 | 1080 | 1200 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం | 29 | 1255 | 1740 |
| 50 కిలోల నత్రజని + 25 కిలోల భాస్వరం + 25 కిలోల పొటాష్ | 32 | 1300 | 1920 |

పై వివరాలనుబట్టి చూస్తే నత్రజనితోపాటు వరి పైరుకు భాస్వరం పొటాష్‌లను కూడా వేయడంవల్ల అదనంగా అయ్యే ఖర్చు ఎకరాకు రూ. 220/-. అయితే దీనివల్లవచ్చే రాబడి ఒక నత్రజనిని మాత్రమేవేస్తే వచ్చిన రాబడికన్నా రూ. 720/- ఎక్కువ. ఇదే విధంగా ఇతర పైర్లకు కూడా విజయ్ 17-17-17 వాడినట్లయితే అధిక దిగుబడి అధిక లాభాలు పొందవచ్చు. విజయ్ 17-17-17లో నత్రజని, భాస్వరం, పొటాష్ పోషక పదార్థాలు సమపాళ్లలో వున్నాయి.

పొటాష్ ఎక్కువగావున్న భూములకు అనువైన ఎరువు విజయ్ 24-24-0. విజయ్ కాంప్లెక్స్‌లతో బాటు పైరుమీద చల్లడానికి విజయ్ యూరియా చాలా అనువైనది.

**విజయ్ ఎరువులను వాడండి—అధిక లాభాలను పొందండి.**

VIJAY
MADRAS FERTILIZERS

వివరంగా తెలుసుకోవాలంటే
యీక్రింది చిరునామాకు వ్రాయండి.
ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44. శాంతినగర్ కాలనీ, హైదరాబాద్-500.028

VIJAY COMPLEX 24-24-0
VIJAY COMPLEX 17-17-17
VIJAY COMPLEX 14-28-14
VIJAY UREA-N46

MFL-1162

## డాక్టర్ సలహాలు

గలిగిన నిపుణులైనవారు, అవసరానికి అందు బాటులో ఉండి కనీస పరికరాలు ఉంటే ప్రతి శిశువుకీ ఈ ప్రమాదాలు ఏర్పడవు

ఎస్. వై. ఎ. బాపట్ల

మా అమ్మాయికి 13 సంవత్సరాలు ప లంతా బాగానే వుంటుందిగాని రాత్రిపూట మాత్రము పిచ్చి పనులు చేస్తుంది. ఒకగంటసేపు ముక్కు విపరీతముగా పెద్ద శబ్దముతో చీద కొనటము, మరొకగంటసేపు నీటితో పుక్కిలించ టము లాంటివి చేస్తుంది. కనుక ఈ లక్షణాలేమిటి తెల్పండి.

ఈ లక్షణాలు మానసిక దౌర్బల్యాన్ని మెదడ లోని అతి సున్నిత భాగాలు ముఖ్యంగా నలుగ రితో కలిసి తిరిగే విధానాన్ని గ్రహించి ఆచరిం చేసే ప్రదేశం సరిగా పనిచేయటంలేదని తెలుప తున్నాయి.

మీరు నిపుణులైన "సైకియాట్రిక్"లన కలుసుకోవటం వారి సలహాపై తగిన చికిత్ చేయించటం మంచిదని నాసలహా !

బి. ఎన్. ఆర్. — వైజాగ్

మా అబ్బాయి పుట్టిన దగ్గర నుంచి మం నిలపటం లేదు. కాళ్ళు సన్నంగా ఉన్నాయి. ఇప్పుడు వాడి వయస్సు 4 సం.ల 6 మాసములు

# మీ బిడ్డ పురోభివృద్ధికి రాచ బాట

## పిల్లల బహుమతి పథకం

ఈ పథకం మూలంగా, మీ బిడ్డకు తనసొంత మొత్తం సమకూడుతుంది. ఈ మొత్తం మీ బిడ్డతోపాటు సురక్షితంగా పెరుగుతుంది. అబ్బాయికి 21వ ఏట (అమ్మాయికి 18వ ఏట) ఒక పెద్ద మొత్తం చేతికి దొరుకుతుంది. పై చదువుకు గాని, ఏదైనా వృత్తిని చేపట్టడానికి గాని, జీవితంలో స్థిరపడటానికి గాని, ఈ వయసులోనేగదా పెద్ద మొత్తం కావలసివచ్చేది! ఇంకా, మా లక్కీడ్రాతో, మీ బిడ్డ పెద్దనగదు బహుమతులను పొందేందుకు అనేక అవకాశములుగలవు!




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

ఇంకా ఇతర సమాచారమునకు దయచేసి
మా అతి దగ్గర ఆఫీసును సంప్రదించండి:

- 45, వీర్ నారిమన్ రోడ్, బొంబాయి 400 023
- 9, మేథ్యూ రోడ్, బొంబాయి 400 004
- 8, కౌన్సిల్ హౌస్ స్ట్రీట్, కలకత్తా 700 001
- 6, పార్లమెంట్ స్ట్రీట్, న్యూ ఢిల్లీ 110 001
- ఫోర్ట్ గ్లాసిస్, మద్రాస్ 600 001

**మీ పొదుపుకు - మెట్లు యూనిట్లు.**






Sista's-UTI-735/76-Tel

## డాక్టర్ సలహాలు

తల్లిపాలు పుట్టినప్పటినుంచే త్రాగలేదు. నోట్లో మంచి మాటలే రావటం లేదు.......

“సెరిబ్రల్‌పాల్సీ”అనే ఈ రోగం తల్లి గర్భం నుంచి శిశువు వెలువడే సమయంలో జరిగిన ఆలస్యం వల్ల, శిశువు మెదడుకి రక్త ప్రసరణ సరిగ్గా జరుగక ఆయాభాగాలు దెబ్బతినటం మూలంగా మెదడు సరిగ్గా పనిచేయక పోవటం, పెరుగుదల లేకపోవటం జరుగుతుంది. మిగిలి వున్న లక్షణాలను ఉపయోగించి ఈ రోగులను సమాజంలో ఒక వ్యక్తిగా మలచటానికి ఎంతో ఓపికతో కృషి చేయాలి.

ఎస్. ఎ. గోకవరం

నాకు 5 సంవత్సరాల వయస్సులో మసూచి వచ్చింది. 20 సంవత్సరాలు వచ్చినా మొహం మీద ఇంకా మచ్చలు వున్నాయి. ఈ మచ్చలు పోటానికి ఏదైనా “ఆయింట్‌మెంటు’ వుంటే వ్రాయండి.

మశూచి వల్ల ఏర్పడిన మచ్చలు (గుంటలు) పూర్తిగా పోవడం అనేది దాదాపు సాధ్యంకాని విషయం అనే చెప్పాలి. ఎక్కడో కొందరు కొన్ని ప్రత్యేక చికిత్సలు చేయించుకొని మేలు పొందామని చెప్పటం అనేదే అటువంటి చికిత్సా విధానాలు మామూలు వారికి అందుబాటులో లేనివనే అర్థాన్ని తెలుపక తెలుపుతున్నది. కాలగతిలో కొంతవరకు ఈ మచ్చలు తరగటం జరుగుతుంది కాని ఏ సమయంలోనూ, పెరగటం, లోతవటం జరుగదు. పెద్దపెట్టున నిరూపించబడనివాటికై అర్రులుచాచి, చివరికి ఆశాభంగం, కొన్ని సమయాలలో వాటివల్ల ఇంతకుముందు లేని వాటినికొని తెచ్చుకోవటంకన్నా ఊరుకోవటం మంచిది.

వి. ఆర్. వీరవాసరం

నా స్నేహితుని వయస్సు 16 సంవత్సరాలు. అతనికి 11 వ సంవత్సరంనుండి తరచు ఫిట్స్ వస్తున్నాయి. అందువల్ల అతను బయటికి వెళితే వాని తల్లిదండ్రులు చాలా ఆందోళనపడుతున్నారు. ఎన్నిమందులు వాడినా పూర్తిగా నయమవట్లేదు.

“ఎపిలెప్సీ” అని ఆంగ్లంలోనూ, “అపస్మారం” అని ఆయుర్వేద శాస్త్రంలోనూ వ్యవహరించబడే మీ స్నేహితునికి ఏర్పడిన “ఫిట్సు” “గ్రాండ్‌మాల్” టైప్ (ఎపిలెప్సీలో ఒక రకం) అని తెలుస్తున్నది. ఈ రోగానికి దాదాపు విసుగు విరామం లేకుండా సంవత్సరాల తరబడి మాత్రలు వాడటం తప్ప వేరే మార్గాంతరం లేదు. ఈ రోగం ఉన్నవారిని, వారిని గుర్తుపట్టని ప్రదేశాలకు మనుష్యుల గుంపులలోనికి పోనివ్వటం మంచిదికాదు. అలా వెళ్ళవలసివస్తే జేబులో అతని వివరాలుగల కాగితం లేక అట్ట ఉంచటం మంచిది. ఫిట్సువస్తే, ఎవరైనా ఇంటికి చేర్చటానికి వీలవుతుంది ఇలా చేస్తే.

—డా. కె. వెంకటేశ్వరరావు

rinted and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

